శ్రీరస్తు

# ఏకాదశీ మాహాత్మ్యము

is book is published with the Financial Assistance of
SRI TIRUMALA TIRUPATI DEVASTHANAMS
ıder their Scheme' Aid to Publish Religious Books

కృతజ్ఞత

ఏ విభు సత్కృపవ, నాకృతి
కా విష్కృత భాగ్యమొదవె। నా విశ్వేశున్
శ్రీ వెంకటాద్రి నాథుని
సేవించెదనే ననిశము చిత్తమునందున్.

గ్రంథకర్త :
యర్రమిల్లి శివశంకరమూర్తి, బి. ఏ. బి.యిడి.
(రిటైర్డు గ్రేడ్_1, సీనియరు తెలుగు పండితుడు
శ్రీ తునిరాజా ప్రభుత్వ జూనియర్ కళాశాల
తుని.
తూర్పు గోదావరి జిల్లా.

ప్రచురణ - ఏరువాక పూర్ణిమ; జూన్ 1994

ప్రతులు : 1000



వెల : రూ॥ 12-00

ప్రతులకు : యర్రామిల్లి శివశంకరమూర్తి
C/o. యర్రామిల్లి సీతాపతిరావు
డోర్ నెం. 45_40_47
అబీద్ నగర్, అక్కయ్యపాలెం
విశాఖపట్నం_16

ముద్రణ : నానా ఎంటర్‌ప్రైజెస్
టౌన్‌హాల్ రోడ్
విశాఖపట్నం_1



గ్రంథకర్త :

యర్రమిల్లి శివశంకరమూర్తి

# ఆముఖము

వ్యాసమహర్షి రచించిన అష్టాదశ-పురాణములలో శ్రీమద్భాగవతము మకుటాయమానము. మోక్ష ప్రాప్తికి మార్గదర్శక ములైన భక్తి జ్ఞాన వైరాగ్యము లిందులో నిరూపింప బడినవి.

"ఏకథలయందు పుణ్య
శ్లోకుడు హరి చెప్పబడును సూరి జనముచే
నా కథలు పుణ్యకథలని
యాకర్ణింపుదురు పెద్ద లతిహర్షమునన్"

అని భాగవతమునందు సూచింప బడినది. అట్టి హరికి ప్రీతిపాత్ర మైనది ఏకాదశి. ఏకాదశి దినమున ఉపవాస మొనర్చి విష్ణుదేవుని కీర్తిం వారు ఆయురారోగ్యైశ్వర్యము లనుభవించి విష్ణుసాయుజ్యము పొందు తథ్యము. బ్రహ్మాండ పురాణాంతర్గమగు రుక్మాంగదో పాఖ్యానము పఠించితి

నాకు 'ఏకాదశి దినమున' ఉపవాసము చేయవలె నని "ఏకా మహాత్మ్యము" ప్రబంధము రచింప వలెనని దృఢ సంకల్పము జనించిన రుక్మాంగద మహీపతిని నాయకునిగా నిర్ణయించితిని. నేను వేదశాస్త్ర పు ణములను పఠించ కావ్యములను పఠించిన పండితుడను కాను.

నా యిష్టదైవమగు విశ్వేశ్వర కటాక్షమున్న సాధ్యము దేముండును? ఆదేవుని ప్రోత్సాహముతో కార్తికశుద్ధ ఏకాదశి రో విఘ్నేశ్వరుని పూజించి వాగ్దేవిని నామనః పద్మంబున నిలిపి లేఖి చేబూని రచనకు గడంగితిని నారచన నిరాటంకముగ గంగ ప్రవాహము సాగినది. నా ప్రతిభ ఏమియు లేదు. నాలేఖిని యందు నిలచి శారదాదేవి గ్రంథమును పూర్తి చేయించినదని నా దృఢ విశ్వాసము.

ఆర్యులు ఇందే మైన దోషములున్నచో తెలిపిన ద్వితీయ ముద్రణ నందు సరిదిద్దు కొందును.

ఇట్లు
బుధజన విధేయుడు
భక్త పరమాణువు
యర్రమిల్లి శివశంకరమ

ఉభయ భాషా ప్రవీణ
అష్టావధాని
కవిసార్వభౌమ-స్వరాజ్యకవి
శ్రీ వడ్డాది సీతారామాంజనేయులు.

కశింకోట

# అభినందన

శ్రీ హరికృప హరి వాసర
మాహాత్మ్యము శంకర కవి మంజుల గతి ను
త్సాహంబున రచియించెను
సాహిత్య ధురీణుడితడు సామాన్యుండే।

భక్తి నౌకయె దాటించు భవ పయోధి
యనెడి సిద్ధాంతమునకు దృష్టాంతము గను
దనర వ్రాసెను "రుక్మాంగద ప్రబంధ"
మెట్టి మిల్లి శంకర కవి యింపు మీర.

హైందవరాజ సద్వ్రత సమన్విత జీవిత సౌరభంబులే
హైందవ జాతి సచ్చరితమై విలసిల్లె, తదున్నత స్థితిన్
బొందు పడంగ జేయుగద పూత భవత్కృతి క్రమ్మరన్, ప్రజా
బృంద హృదాంత రాళమున, శ్రీ శివశంకరమూర్తి। సత్కవీ।

పొంగగ జేయుమా। విబుధ పుంగవ కోటిని, తావ కాంధ్రరు
క్మాంగద సచ్చరిత్రము రమాధిప, దివ్య మహత్వతత్వస
త్సంగతి నద్ది యొప్పెను గదా। శివశంకరమూర్తి సత్కవీ।
బంగరు రంగశాయి నిను బాలన సేయుత। భద్రదాయియై।

శతపత్రాక్షు నను గ్రహంబు మది నించన్ జాలు "నేకాదశీ
వ్రత మాహాత్మ్యము" సత్ప్రబంధముగ నిర్మాణంబు గావించి ధీ
చతురుండౌ శివశంకరాఖ్యకవి విశ్వస్తుత్యుడాయెన్, మహో
న్నత పుణ్యంబున నెట్టిమిల్లి కుల మత్యంత ప్రశస్తిన్గనెన్.

వ. సీతారామాంజనేయులు

కవిరత్న : సాహిత్యభూషణ
వసంతరావు రామకృష్ణరావు
M.A. (ఇంగ్లీషు); M.A. (తెలుగు)
కవి : రచయిత : పరిశోధకుడు
విశాఖపట్నము

# అభిప్రాయము

మాన్య మిత్రులు, కవి శేఖరులు, మరియు ఆంధ్రభాషాకోవిదులు, అధ్యాపకులు నైన శ్రీ యల్లమిల్లి శివశంకరమూర్తి గారిచే రచింప బడిన "ఏకాదశీ మాహాత్మ్యము" అను పద్య కావ్యము వ్రాత ప్రతిని చదివి, ఆనందించితిని.

శ్రీతుని రాజా ప్రభుత్వ జూనియర్ కాలేజీ లో గ్రేడ్ సీనియర్ తెలుగు పండితులుగా పని చేసి, పదవీ విరమణ చేసిన శ్రీ శివశంకరమూర్తి గారు,లోగడ, కొన్ని కావ్యములను వ్రాసి, ప్రచురించి, లబ్ధ ప్రతిష్ఠు లైరి వీరు ఒంటి మామిడి గ్రామ వాస్తవ్యులు; వీరి పూర్వులు నిర్మించిన శ్రీరాజ రాజేశ్వరీ, విశ్వేశ్వర స్వామి వారి దేవాలయమచట కలదు. ఆ కారణము చేత, వీరు భక్తి ప్రపత్తులతో, ఈ "ఏకాదశీ మాహాత్మ్యమును" రచించి తరించినారు.

ఇష్ట దేవతా ప్రార్థనముతో ప్రారంభ మైన ఈ మనోహర పద్యకావ్య ము నందలి వస్తువు జగత్ప్రసిద్ధ మైనది శ్రీ బ్రహ్మాండ పురాణము నందుగల "రుక్మాంగద చరిత్రము"ను, ఏకాదశి మాహాత్మ్యమును తెలుపు సన్నివేశముతో, చక్కని శైలిలో, వీరు రచించుట మావంటి వారికి ఆనంద దాయకము. భక్తి సంధాయకముగా పద్యమును నడుపుట కత్తిమీద సాము వంటిది. ఇందులకు కవి ప్రతిభ కలవాడయి ఉండ వలెను; భాషా పరి జ్ఞానము కలవాడయి ఉండవలెను, అనేక పురాణములను, పద్యకావ్యము లను ప్రబంధములను చదివిన వాడయి యుండవలెను.

వీరు సీనియర్ గ్రేడ్ తెలుగు పండితులుగా పనిచేసిన వారగుటచేత, వారికి పైన చెప్ప బడిన ప్రత్యేక అర్హతలు కలవు. అదికాక, వారు సుదీర్ఘమైన విద్యా బోధన చేసిన మహనీయులు అదియే వారి దివ్యసాధనగా, ఈ మనో హర కావ్యరచనకు కారణమయినది.

ప్రాచీన కవితా సంప్రదాయము ననుసరించి వ్రాయబడిన, ఈ కావ్యమునందు, శ్రీహరి పరమైన షష్ఠ్యంతములు మనోహరముగా ఉ వీరు వ్రాసిన సీస పద్యములలో ఒక ప్రత్యేకత ఉన్నది. విషయ వివరణ పాటు, ఆహ్లాదమును కూర్చుచు, చదువరులలో భక్తిని పాదుకొల్పుచు, వీరి పద్యరచనమత్యంతము ప్రశంస నీయమై ఉన్నది అలంకా నిర్దేశించిన, శబ్దార్థా లంకారములను వీరు తమ కావ్యమునందు హృ గా ప్రయోగించి తమకుగల పాండిత్యమును వెల్లడించిరి.

హింస, క్రౌర్యము, విధ్వంసకాండ, పెల్లుబుకుచున్న, ఈ సమాజజీవనమును, సంస్కరించుటకు, ఇటువంటి భక్తి ప్రబోధాత్మ కావ్యములు వెలువడవలసిన అవశ్యకత ఉన్నది, కవులు తమ పమ సమాజ సంస్కారమునకు కలమును చేపట్టవలెను, అవిధముగా శ్రీమూర్తిగారు భక్తితో పాటుగ, సంస్కార భావమును కూడ వెల్లడి ముదావహము; శుభావహము.

ఇందుగల కంద పద్యములలో భావస్ఫూర్తి చదువరుల నా క చుందును; వీరు పంచ చామరము, మత్త కోకిల, సర్వలఘుకందము కము మొదలగు పద్యలను కూడ హృద్యముగా రచించిరి.

ఇటువంటి కావ్యములు వీరి లేఖిని నుండి వెలువడ వలెనని నాఆ

దయామయుడగు శ్రీనారాయణుడు వీరికి ఆయురారోగ్య భా లందించుచు వీరి కవితా వ్యాసంగము సమాజపరముగా ప్రయోజన ఉండునట్లు వీరిని దీవించు గాక.

# ఆశంస

కళాప్రపూర్ణ చర్ల గణపతిశాస్త్రి

మానవ జీవితమును పవిత్రము చేయునది భక్తి. భక్తితో భగవంతుని సేవించి తరించుట మానవుని జీవిత లక్ష్యము. ఆంధ్ర సాహిత్యములో భక్తి రసప్రధానములైన కావ్యములు అనేకములు కలవు అందు ప్రధానముగా చెప్ప వలసినది భాగవతము.

భక్తుడైన వానికి ఈ రాని దెద్దియు లేదు శ్రీ యల్లమిల్లి శివశంకర మూర్తిగారు రచించిన ఏకాదశీ మాహాత్మ్యము ఈ కోవకు చెందిన కావ్యము వారి పేరులో శంకరుడున్నారు. వారి వాక్కులో శంకరుడున్నాడు వారు శివభక్తులని చెప్పక చెప్పుచున్నది వారి కావ్యము. ఏకాదశీ మాహాత్మ్యము విష్ణు భక్తి ప్రతి పాదక మైనట్టిది. అట్టి దానిలో కవి సమయము దొరికి చోట తన లోని శివభక్తిని వెల్లడించు రీతిలో శివస్తుతిని రమ్యము లోకమున్నకు చాటి చెప్పినారు.

ఇక కావ్యమును పరిశీలించినచో కావ్య రచనము ప్రాచీన పద్ధ గలది యైనను, పద ప్రయోగము మాత్రము నూతనమై విలసిల్లినది. వీ తమ కావ్యములో అష్టాదశ వర్ణనలను కూర్చి చదువరులకు విసువు కల్గిం లేదు. కథను సున్నితముగా సూటిగా నడిపించి నారు. వీరు అనుభవజ్ఞులై అధ్యాపకు లగుట చేత తమ లోకాను భవమును మానవాళికి ఉపయో పడురీతిగ కావ్య రచన సాగించి నారు.

వీరి రచనా సామర్థ్యమును చవి చూపుటకు. 47వ పేజీలోని,

నళినాప్త తేజాయ నాగేంద్ర హారాయ భవ విదూరాయ తుభ్యంనమో

అన్న సీసపద్యమును 60వ పేజీలోని

లింగ। సుగంధ చందన విలేపిత-రమ్యసుభాంగ। భస్మితా

అన్న ఉత్పల మాలను, 101 పేజీలోని,

శ్రీ జాహ్నవీ జలసిక్త జటా జూట। జూట విస్ఫూర్జిత శోభ చంద్ర

ఈ విధముగా సుందరములై భక్తిరస సంపన్నము లైన పద్యము ఈ కావ్యనందు చాల గలవు మచ్చునకు కొన్నిటిని చూపించితిని.

అధ్యాపకు లగుటచేత సమ కాలీన సమాజ సంస్కరణము వలయు నట్టి రీతిలో వీరిచరన మున్నది.

వీరింకను ఇట్టి రచనలను పెక్కు గావించి సమాజమునకు సే చేయుదురు గాక.

# కృతజ్ఞత

ఆధ్యాత్మిక గ్రంథముల ముద్రణకు "ఆర్థిక సహాయము" అను పథకము క్రింద తిరుమల తిరుపతి దేవస్థానము వారనుగ్రహించిన ధనముతో ఈ గ్రంథము ముద్రింప బడినది.

ఈ ఆర్థిక సహాయమునకు కారణ భూతులైన శ్రీ తిరుమల తిరుపతి, దేవస్థానము పాలక వర్గమునకు, సంఘ సభ్యులకు కార్య నిర్వహణాధికారి గార్కి నా వినయపూర్వక కృతజ్ఞతాభి వందనములు. నేను కోరినవెంటనే నా గ్రంథముగ పరిశీలించి తమ అమూల్యాభి ప్రాయము నొసగిన కళా ప్రపూర్ణ శ్రీ చర్ల గణపతిశాస్త్రిగారికిని. నేను రచించిన "ఏకాదశీ, మాహాత్మ్యమును" అమూలా గ్రముగ పరిశీలించి, సవరించి సహకరించిన కవి సార్వభౌమ, స్వరాజ్య కవి అష్టావధాని శ్రీ వడ్డాది సీతారాంజనేయులు గారికిని, ఈ గ్రంథమును పర్యవేక్షించి తమ సదభిప్రాయము నొసగిన కవిరత్న, సాహిత్య భూషణ, కవి మిత్ర శ్రీ వసంతరావు రామకృష్ణారావు గార్కిని నా కృతజ్ఞతా నమస్కృతులు.

ఈ గ్రంథ ప్రచురణ విషయములో సంపూర్ణముగ సహకరించిన వారు, ప్రస్తుతం తిరుపతి వాస్తవ్యులు, మాముఖ్య బంధుకోటిలో నొకరు, హోమోపతి డాక్టరు గారు అగు శ్రీ చాగంటి బాల సూర్యబంగారాజు గార్కి నా ధన్యవాదములు.

ఈ పుస్తక ముద్రణకై అన్ని విధముల సహకరించి సకాలములో ముద్రించి యిచ్చిన "నానా ఎంటర్‌ప్రైజస్" ప్రింటర్స్, బైండర్స్ మేనేజరు శ్రీ కోపల్లె రామమూర్తిగార్కి నా వినయ పూర్వకాభి వందనములు

ఇట్లు

బుధజన విధేయుడు;
యర్రమిల్లి శివశంకరమూర్తి
రచయిత

శ్రీ ర స్తు

# ఏకాదశీ మాహాత్మ్యము

ఇష్టదేవతా ప్రార్థన.

శ్రీ వైకుంఠపురమ్మునన్ ముదముతో సింహాసనాసీనుఁడై
దేవిన్ లక్ష్మిని గూడియుండి, జగము దీపింపగా జేయుచున్
దేవానీక కిరీటరత్న రుచి యెంతే మించు పాదాంబుజున్
శ్రీ విష్ణున్ మదిలో భజింతు, నెపుడున్ శ్రేయస్సు లర్థించుచున్.

శా॥ శ్రీ వత్సాంకుఁడు పంకజోదరుఁడు లక్ష్మీ చారువక్షస్థల
శ్రీ విభ్రాజితుఁడిద్ధ విక్రముఁడు ధాత్రీ మానినీశుండు రా
జీవాక్షుండు సహస్ర భాస్కర మరీచిస్ఫార తేజస్కుఁడా
శ్రీ విష్ణుం డొసగున్ గృపామతిని గూర్మిన్ మామకాభీష్టముల్.

సీ॥ వికచాబ్జములఁబోలు వెడద కన్నులతోడ
పూర్ణ చంద్రునివంటి మోముతోడ
చెవుల కింపొనరించు చిలుక పలుకులతోడ
వేడ్క గొల్పెడు నళి వేణితోడ
మహనీయ సుమనోజ్ఞ మందహాసముతోడ
స్వర్ణభాసుర తను చ్ఛాయతోడ
భూరి కాంతులనీను భూషణంబులతోడ
జిగిదేఱు జిలిబిలి చీరతోడ

తే॥ గీ॥ విష్ణు వక్షంబుపై నొప్పు వెలదిమిన్న
మన్మథునిగన్న లలితాంగి మందగమన
జలజనాభుని ప్రియురాలు జలధిపుత్రి
సిరులజేకూర్చ మాయింట వెలుగుగాత.

సీ॥ శిఖలలో మిన్నేరు శిరమున జాబిల్లి
కంఠాన గరళంబు కాంతులీన
ఫాలనేత్రంబును ఫణిభూషణంబులు
రుద్రాక్షమాలలు రుచులనెసఁగ,
భస్మదేహంబును వ్యాఘ్రజినంబును
చేత త్రిశూలంబు జెన్నుమీఱ
షణ్ముఖ, విఘ్నేశ సహజన్ము లిరువురు
చెఱియొక ప్రక్కను జేరి కొలువ

తే॥ గీ॥ వామపార్శ్వంబున భవాని వఱలుచుండ
ప్రమథగణములు సద్భక్తిఁ బ్రజతులొసఁగ
వెండికొండపై విహరించు విశ్వనాథు,
నిష్టకామ్యార్థ సిద్ధికై యెద భజింతు

తే॥ గీ॥ ప్రమథమునిగణ సేవిత పద్మనయన;
భూధరేశ్వరు పుత్రిక పుణ్యరాశి
షణ్ముఖునిగన్న జనయిత్రి శంభురాణి
కరుణ వెలయించి మమ్ములఁ గాచుగాత।

సీ॥ సురుచిరకాంతులు శోభిల్లు పద్మంబు
రత్నాల గద్దెయై రహిచెలంగ
వేదాదివిద్యల విహరించు పూబోఁడి
గారాబు దాసియై కరము మిగుల
క్షీర నీరంబుల నేరిమి విభజించు
కలహంస వాజియై యలరుచుండ
జిలిబిలిపలుకులఁ జెలువారు నవ్వాణి
వదన గహ్వరమున వఱలుచుండ

తే॥ గీ॥ సర్వసృష్టిని గావించు శాంతమూర్తి
జగతి ఖేలనఁ బాలించు, జలజసూతి
ఆయురారోగ్య సుఖముల నందజేసి
సాదరంబుగ మమ్ముల సాకుగాత।

సీ॥ రవిచంద్ర తారల రాజిల్లు గగనంబు
ప్రవిమల ఛత్రమై పరిఢవిల్ల;
తైడి కాంతులనీను ఫాలభాగంబున
కమ్మ కస్తురిబొట్టు గ్రాలుచుండ
పద్మాసనంబున బాగొప్ప గూర్చుండి,
కరకంకణ ధ్వనుల్ ఘల్లురనగ
దంత్రీ స్వనంబులఁ దగురీతి సవరించి
సంగీత సాహిత్య సరణి మెఱయ

తే॥ గీ॥ శిలలు కరుగంగ మోడులు చిగురులెత్త
వీణవాయించు చెలువ కల్యాణి, యజుని
రాణి సైకతశ్రోణి, పురాణి వాణి
మంజు వాగ్గుంభన లొసంగి మనుచుగాత.

సీ॥ ప్రమథ గణాధ్యక్షు। బహుళ విద్యాదక్షు
సుగుణాల వాలు। యంశో విశాలు।
సదమల చారిత్రు। చారువామనగాత్రు।
సుమనోజ్ఞ శశివర్ణు। శూర్పకర్ణు।
నానందదాయకు నఖిలాండ నాయకు
మౌని హృదయవాసు। మందహాసు
శ్రితజనపోషకు సిద్ధివినాయకు
శాంభవీ ప్రియపుత్రు శైలధీరు।

తే॥ గీ॥ సర్వదేవతా శ్రేష్ఠు। నిష్ఠాగరిష్ఠు।
సామజాననము సకల వాంఛా ప్రదాను।
లోక పూజితు ధీమంతు। నేకదంతు।
మామకాభీష్ట సిద్ధికై మదిని గొలుతు

తే॥ గీ॥ అంజనేయుని సద్భక్తి నభినుతించి,
వ్యాస వాల్మీకుల హృదిని పాదుకొలిపి
భోజహర్ష మయూరుల భోగడి మదిని
దండి కాళిదాసాదుల దగనుతించి

సీ॥ శబ్దశాసనుసూక్తి సరణిని వినుతించి
నన్నెచోడుని మది సన్నుతించి
పాల్కురికిసోముని భక్తిని పాటించి
తిక్కన సాహిత్య ఫక్కి నరసి
శంభుదాసుని వచన చాతురి గొనియాడి
శ్రీనాథు కావ్యముల్ ప్రీతిగాంచి
పోతన సహజమౌ పోకడల్ గమనించి
అష్ట దిగ్గజముల నభినుతించి

తే గీ॥ అధునిక సుకవీంద్రుల కంజలించి
పూని రుక్మాంగద విభుని పుణ్యచరిత
మేదినీ ప్రజలెల్లరు మెచ్చు మాడ్కి
సులభ శైలిని రచియింతు సొంపుగాను.

కం॥ చక్కగ విద్యల నన్నియు
మక్కువతో నేర్పినట్టి మద్గురువరులన్
మిక్కిలి శ్రద్ధాభక్తుల
నెక్కాలము గొలుచుచుందు నెదలో జగతిన్

సీ॥ ధాత్రి శ్రీవత్సస గోత్రుండు వేంకటా
చల నామధేయు డే జ్ఞాని తాత
నిత్య సత్య వచనా నిపుణ గరిష్ఠుడు
కనకాచలాఖ్యు డే ఘనుని తండ్రి
సంగీత సాహిత్య శాస్త్రకోవిదుడు నా
రాయణుం డెవరి కగ్రజుడు భువిని
ప్రణుత విజ్ఞాని సుబ్రహ్మణ్య శేఖరుం
డరయ నెవరి ద్వితీయాగ్రజుండు

తే గీ॥ విమల చారిత్ర యే మీనాక్షి వెంకటేశ
సహజ సద్గుణరాశి యే చతురురాణి
అట్టి శ్రీ యద్రమిల్లి వంశాబ్ధిచంద్రుడు
మజ్జనకు వెంకటేశ్వరు మదిని గొలుతు.

## అంకితం

కII శ్రీహరి కథనిం పొరగ
శ్రీహరికే నంకితమ్ము చేసెదఁ బ్రీతిన్
శ్రీహరి గొలిచినవారికి
శ్రీహరియే యొసఁగునండ్రు సిరిసంపదలన్.

తే॥ గీ॥ దోషముల్ దొర్లకుండగ తోడుపడుచు
పూనిచేసెడి కావ్యంబు పూర్తి చేసి
కోర్కెలన్నియు నీడేర్చి కు వలయమున
కరుణతోడను మమ్మేలు కమలనాథ.

### షష్ఠ్యంతములు

కII శూరునకు భక్తజన మం
దారునకు నిఖిలదనుజ వి దారునకు సురా
ధారునకుఁగౌస్తు భాలం
కారకునకు మురహరునకుఁ గళ్యాణునకున్.

కII ధరణీసురక్షరక్షకునకు
సరసీరుహ లోచనునకు శ్యామాంగునకున్
నరకాసుర భంజనునకు
గరుడారూఢునకు నమిత కరుణాళునకున్.

కII శ్రీ లక్ష్మీ కాంతునకున్
ఫాలాక్షాభినుతునకును పద్మాక్షునకున్
లీలామయ గోపకునకు
శీలంబున దేజరిల్లు శ్రీవిష్ణునకున్

కII అమలిన శుభగాత్రునకున్
విమల యశోభూషణునకు బృధ్వీశునకున్
గమనీయ గుణాకరునకుఁ
గమలామానస హరునకు గరివరదునకున్.

క॥ గిరిధారికి హితకారికి
వరహృదయ విహారికి జిత వైరికి కిటికిన్
సరసీరుహభవ వందిత
చరణద్వయి కచ్యుతునకు శౌరికి హరికిన్.

వ అత్యంత భక్తితో ననేత సాష్టాంగ దండప్రణామంబు లాచరించి శ్రీహరిని కృతిపతి గావించి నే రచియింప బూనిన బ్రహ్మాండ పురాణం బందలి ఏకాదశీ మాహాత్మ్య మను రుక్మాంగద చరిత్ర కథా క్రమ మెట్టి దనిన—

కథా ప్రారంభము

ప్రథమాశ్వాసము

సీ॥ మాలతీ మందార మాధవీ మాలూర
చూత సాల కదంబ శోభితంబు
శరభ సింహ వరాహ శార్దూల భల్లూక
సారంగ సారంగ సంయుతంబు
చక్రవాక మయూర జలకుక్కుట బలాక
కలహంస శుక పిక కలకలంబు
సరసిజ కువలయ సౌరభోపేత వి
విధ జలజాకర విలసితంబు

తే॥ గీ॥ దేవ గణములు విహరించు దివ్యభూమి
యఖిల వేదశాస్త్రంబుల కాటపట్టు
మౌనిసత్తములకు తపోమందిరంబు
తలంప నైమిశారణ్య మిద్ధరణి యందు.

వ అట్టి నైమిశారణ్యంబున వైష్ణవ యాగంబులు మహావైభవముగ జరుగుచుండ శాండిల్య, మౌద్గల్య, కశ్యప, వాలఖిల్య, వ్యాస, కౌండిన్య గౌతమ, శుక, వశిష్ఠ, కౌశిక, చ్యవన, మార్కండేయ, జాబాలి, సాంఖ్యాయన, వాల్మీకి, భరద్వాజ, కలశజన్మ, శృంగి, తృణబిందు, మతంగాది మహామునులు సుఖాసీనులై యుండ, సూతుండు మృదు

మధుర వాగ్విభవం బలర భాగవత, మత్స్య, వామన, మార్కండేయ, బ్రహ్మ, బ్రహ్మాండాది పురాణంబులు వక్కాణించుచుండ-

తే॥ గీ॥ పుణ్యగాథలు వరుసగ పూని నుడువు
వ్యాస శిష్యుని విమల వాక్ ప్రౌఢిజూచి
మదిని హర్షంబు నందుచు మౌను లపుడు
పలికి రీ విధి మిక్కిలి ప్రమదమునను.

క చతురమతివి నీవు కథల
నతిరమ్యముగ వివరించి యలరించుటలో
మతి హితమగు రుక్మాంగద
పతి చరితముఁ దెలుపవే కృపామతి మాకున్.

క హరి వాసర వ్రతంబును
ధర రుక్మాంగద విభుండు తద్దయు సేయన్
పురపాలన వీడి యముఁడు
సరసిజభవు దరికి నేల చయ్యన జనియెన్.

క యము దీనత్వముఁ బొడగని
కమలాసనుఁ డే మొనర్చెఁ గారుణ్యమునన్
శ్రమలకు గురియై మహిపతి
కమలాక్షుని మహిమ నెట్లు ఖ్యాతి వహించెన్.

వ అని యడుగు

తే॥ గీ॥ మునుల పలుకులు విని కడు మోద మంది
జ్ఞానధనులగు మీకంటె చతుర మతినె?
ప్రేమ నను గోరితిరిగాన పెద్దఁజేసి
యుక్తియుతముగ వినిపింతు శక్తి కొలది.

వ అని పలికి సూతుండు బ్రహ్మాండ పురాణాంతర్గతమగు రుక్మాంగద చరిత్రను మీనుల విందుగ వారి కెరిగింప దలంచి ముందుగ శ్రీహరి నిట్లని స్తుతించె-

సీ॥ శ్రీవత్సలాంఛను శ్రితజన మందారు
కారుణ్య సాగరు కమలనాభు
కాంచన వరచేలు కౌస్తుభాలంకారు
జలజభవు జనకు జలజనేత్రు
గోవర్ధనోద్ధారు గోగణ పరిపాలు
నాగరాజ శయను నాగవరదు
హర్యక్ష నిభమధ్యు నఖిల సురారాధ్యు
కాళీయ మర్దను కంసహరణు

తే గీ॥ దివ్య సుందర విగ్రహు దేవ దేవు
పార్వతీ విభు పూజిత భవ్యపాదు
గరుడ వాహను కాంచన గిరినివాసు
విష్ణుదేవుని సద్భ __ ః నుతి చేసి

కం॥ సురగణ వందితములు, భవ
హర శోధితములు జిత కలుషాయుతములు శ్రీ
కర రత్నో ద్దీపితములు
సరసీరుహనాభు దివ్య చరణాబ్జంబుల్.

క శ్రీకరములు. భూజన మో
దాకరములు, సకల సద్గుణాకరములు సౌ
ఖ్యాకరములు జిత సంక్షో
భాకరములు శుభకరములు హరిచరితంబుల్,

తే గీ॥ అనుచు యదుకులాలంకారు నాత్మ దలంచి
వ్యాస మౌనీంద్రుడు మనమున నభినుతించి
తాపస శ్రేష్ఠులను గాంచి తత్త్వబోధ
నుందు పలికె నీరీతి వినుం డటంచు.

మ రమణీయంబగు సౌధరాజములతో రంజిల్లు శ్రీవాటికల్
తమిచే నొందెడి భాధలన్ మనుపు విద్వద్బృంద సంపత్తియున్
మమతన్ బిడ్డల మాడ్కి నెల్లరను సన్మానించు రాజేంద్రు గ
ల్గి మహిన్ శ్రీ విదిశాపురం బొనరు నగ్గీర్వాణ పట్నం బనన్.

చ॥ నిరతము వేదశాస్త్రములు నిష్ఠ పఠించుచు ముక్తిగోరుచున్
ధరణిని రాజుచే సతము దైవము మాడ్కిని పూజలందుచున్
నిరుపమ భక్తిఁ గర్మతతి నేర్పున సల్పుచు నప్పురంబునన్
సరస వచో విలాసమున కాంతత నొప్పిరి బ్రాహ్మణోత్తముల్.

క॥ రణమున జొచ్చిన వెనుకకు
నణుమాత్రము తగ్గిపోవ రా పురి రాజుల్
గణియింప వారి శౌర్యము
ఫణినాథున కైన వశమె వసుధా స్థలిలోన్.

క॥ సిరిగల యలకేశ్వరుఁ డిల
సిరి నెవ్వరి కిచ్చె నంచు చింతించి మదిన్
సిరిగల తత్పురి వైశ్యులు
సిరి నిత్తురు బుధులఁ బిలిచి శేషుడు మెచ్చన్.

క॥ ధరణీనాథుని సేవా
పరతంత్రులు విష్ణుపాద భజనాసక్తుల్
కరిబల సమాన భుజబలు
లరయంగా గురుయుతులగు నప్పురి శూద్రుల్.

క॥ తరువులు కల్పక వృక్షము
లరయంగా వారణములు నైరావణముల్.
హరు లుచ్చైశ్శ్రవములు శ్రీ
హరి సేవానిపుణు లలరు నాపుర మందున్.

తే॥ గీ॥ విద్య నపరి శేషు లచటి విప్రవరులు
మదను మరిపింత్రు సొగసున మానవాళి
వేల్పు టింతు లందంబున వెలదు లరయ
కామధేనువు లందు గోగణము లెన్న.

సీ॥ నిగనిగ లాడెడు నిడుదలౌ కురులను
చక్కనౌరీతి కీల్గడ ఘటించి
పసుపు నిగ్గులు దేరు ఫాలభాగంబున
దిలకంబు నేర్పుతోఁ దీర్చి దిద్ది
ఘుమఘుమ వాసనల్ గుప్పు నట్లెంతయు
గబ్బిగుబ్బల యందు గంధ మలది
పాదపద్మం బుల పైఁబడి జీరాడ
పట్టు పుట్టంబులఁ బరగ దాల్చి

తే గీ॥ మొల్కయౌ భూషణంబులు మేనబైచి
కుసుమ విలుకాని కేళిని గోరి వచ్చు
వల్లవాపశుల్ మనమున నుల్లసిల్ల
వేశ్య లప్పురి విహరింత్రు విపణి వీధి.

వ॥ అప్పురాధీశ్వరుండు

సీ॥ స్వప్నంబు నందైన సత్యంబుఁ దప్పని
సదమల హృదయుఁడౌ జ్ఞానిభుండు
శరణార్థియై వచ్చు శత్రువు నైనను
మన్నించు కృపగల మానధనుఁడు
ఘోరాజి యందైన ధీరతన్ గోల్పోని
శస్త్రాస్త్ర వేదియౌ శౌర్య వరుఁడు
కడ గండ్ల యందైన కౌస్తుభాలంకారు
పూజలు వీడని భూధవుండు

తే గీ॥ వీరుఁ డకలంకు దక్షుఁడు విక్రముండు
దాన ధర్మములందొప్పు మానసుండు
విష్ణు భక్తాగ్రగణ్యుండు వేద విదుఁడు
మహిని తత్పుర మేలు రుక్మాంగదుండు.

మత్తకోకిల అలి తోడను చక్రిపూజల నాచరించుచు నెప్పుడున్
మేలు మేలని ధాత్రియందలి మేది నీశ్వరులెన్న నా
ప్రోలునేలెను ధర్మమార్గము రూఢిగా నెలకొల్పుచున్
శైల ధీరుఁడు శౌర్యవంతుఁడు క్ష్మాతలేంద్రు డెంతయున్

పంచచామరము పురాణ సార్వభౌమ ముఖ్య భూధవాళిఁ బోలుచున్
సురేంద్ర నాథులెల్ల మెచ్చ సుస్థిరంపు కీర్తితో
ధరాస్థలిన్ నరేంద్రుఁడేలె దాన చక్రవర్తియై
పురంబు నందు నెల్లవారు మోదమందునట్లుగన్.

తే॥ గీ॥ వసుధ ధర్మంబు నాలుగు పాదములను
పరగ నెలకొల్పి యత్యంత ప్రమదమునను
రాజ్యమేలు రుక్మాంగద రాజచంద్రు
డొప్పుగా సౌధ మందున నొక్కనాడు.

సీ॥ విమల యశోలాలిత మనోభిరాము లే
కవిగాయక బుధపుంగవుల తోడ
వేదశాస్త్ర పురాణ విజ్ఞాన సంపద
గణనకెక్కిన విప్ర గణముతోడ
రాజకీయంబుల రాణ వహించిన
భాస్వరులౌ మంత్రి వరులతోడ
వైరి నృపగజకుం భస్థలంబులఁ జీల్చు
సాహస రాజకేసరులతోడ.

తే॥గీ॥ ప్రణుతి గాంచిన సేనాధి పతులతోడ
చతుర మతులగుసామంత పతులతోడ
నిండు పేరోలగంబున నిర్జ రేంద్రు
మాడ్కి భాసిల్లు చుండె రుక్మాంగదుండు.

వ॥ ఆ సమయంబున శుక శౌనకాది మహర్షులు రాజేంద్రు సరయు
వచ్చిరి.

క॥ వచ్చెడు సంయముఁల స్గని
పచ్చల గద్దియను డిగ్గి భక్తియుతు డై
జెచ్చరఁ బని[ప్రెం]కింగా
ముచ్చటతోఁ బల్కిరపుడు మునివరులంతన్

సీ॥ శ్రీ భాస్కరా న్వయ సింధు సుధా కర।
మహనీయ లావణ్య। మన్మథాంగ।
సద్ధర్మ పరిపాల। సత్కీర్తి విస్తార।
సారస దళనేత్ర। సచ్చరిత్ర।
సాధు జనావన। సన్నుత పరిజన।
యాశ్రితామర। కరుణాల వాల।
వినయ విభూషణ। విజ్ఞాన సాగర
విమత భయంకర। వినుత శీల।

తే।గీ॥ సిద్ధ కామోస్తు దీర్ఘాయు సిద్ధి రస్తు।
వివిధ విభ వోస్తు। వంశాభి వృద్ధి రస్తు।
భవ్య విదిశాపురా ధీశ। దివ్య తేజ।
కుజన దూర। రుక్మాంగద క్షోణి పాల।

వ॥ అని మనః పూర్వ కంబుగ నా శీర్వదించు సంయమి వరుల
నారాజ శ్రేష్ఠుండు సంతసంబున గొనివచ్చి సుఖా సీనుల గా
వించి యర్ఘ్య పాద్యాదు లొసంగి సత్కరించి వినయముఁతో
నిట్లనియె.

పంచచామరము।

మునీంద్రులార మీదురాక మోదమయ్యె నియ్యెడన్
ఘనంబుగాను మీరు నన్ను గాంచగోరి వచ్చుటన్
జనంబు నేలుచున్న రాచ చంద్ర బృంద మందునన్
మనంబు నందు నెంచ నేను మాత్ర మెంతొ మాన్యుడన్.

క॥ వ్రతముల సన్నిటి లోనే
వ్రతంబు సువ్రతము సంగ, వసుధంబరగు నే
వ్రతమాచరింప శ్రీహరి
సతతంబును బ్రోచుచుండు, సంయములారా।

క॥ ధరణీశుని మాటలు విని
పరమానందంబు తోడc, బలు గ్రంథములన్
బరికించి వ్రతము లన్నియు,
సరసత తోc బలికిరిట్లు, సంయమి చంద్రుల్.

క॥ సురుచిర శుభ ప్రదంబై
సిరియును సంపదయు గూర్చి జిత కలుషంబై
సరిలేని సువ్రతంబై
ధరలో నేకాదశీ వ్రతంబ లరారున్.

క॥ శక్తి కొలది నీ వ్రతమును
భక్తి యుతంబుగ నొనర్చు పాపులకైనన్
భక్త జన వత్సలుడు హరి
ముక్తి నొసcగు తథ్యమిదియు; పుడమీ నాథా.

సీ॥ సంసార భవ దుఃఖ జలరాశికిని నావ
యజ్ఞాన తమమున కరుణకాంతి
బహుళ కిల్బిషశైల వజ్ర నిపాతంబు
సద్గతి ప్రాప్తికి సత్పథంబు
జటిల దురిత మేఘ పటలికి పవనంబు
కామితార్థ సుఫల కల్పతరువు
హృదయ జాడ్యంబుల కింపగు నౌషధి
యతి లోభగుణవిపి నానలంబు

తే॥ గీ॥ శ్రీకరంబెల్ల గుణముల కాకరంబు
సకల కళ్యాణ మూలంబు శాంతికరము
భూరి భోగ భాగ్యములకుఁ బుట్టినిల్లు
క్షితి తలేశ్వర! యేకాదశీ వ్రతంబు.

తే॥ గీ॥ దశమినా డేక భుక్తంబుఁ దగనొనర్చి
హరి దినంబునఁ బూర్తిగ నశనముడిగి
హరినిఁగొల్చుచుఁ జాగర మాచరించి
ద్వాదశిని పారణము చేయవలయు భూప.

తే॥ గీ॥ విషయవాంఛల నన్నిటి విడిచిపెట్టి
భక్తియును శ్రద్ధయును మదిఁ బాదుకొల్పి
కర్మదీక్ష వహించి పై కాలమందు
కమల నాథుఁ గీర్తించుచు గడుపవలయు.

వ॥ ఇట్లు సంవత్సరమంతయు చేయ లేనివారు

సీ॥ మహిపాల వినవయ్య మహి మాయుతంబగు
నాషాఢ సితపక్ష హరిదినంబు
పరిణతి గాంచిన భాద్రపదము నందలి శుక్ల
పక్షపు శ్రీవిష్ణు వాసరంబు
మాసంబులందున మాన్యమౌ కార్తిక
శ్వేత పక్షైకాదశీ తిథియును
భక్తితో శుష్కోప వాసముండవలయు
పై విధిఁజేయక వసుధలోన

తే॥గీ॥ గర్వమున భోజనంబును గడగి సేయు
జను లవశ్య మరుగుదురు శమను పురికి
మదినిది యెఱిఁగి యెల్లరు మసలవలయు
సకల శాస్త్ర సమ్మతమగు సత్యమిదియ.

క॥ ఏకా దశీవ్రతంబిల
నేకాగ్రతఁ దోడఁ జేయు నిద్ధ చరిత్రున్
శ్రీ కాంతుఁడు బ్రోచు సతము
వైకుంఠ నివాసమొసగి పాయని భక్తిన్.

క॥ హరి వాస రోప వాసము
హరియించును పాతకముల నద్భుతఫణితిన్
హరివాసరాన్న దురితము
సురుగదు గురుపుణ్యములను క్షోణీనాథా!

వ॥ ఈ వ్రతాచరణము వలన పంచమహాపాతకములు నశించు నని చెప్పి, రవికులావతంసు రుక్మాంగదు నాశీర్వదించి మామా అశ్రమములకుఁ జనెదమని పలుకు మునిపుంగవుల వీక్షించి, ధరణీనాథుం డిట్లనియె.

క॥ హరిదిన సువ్రత విధమును
పరిపూర్ణముగ వివరించి పలికిరి నాతో
ధర నీ వ్రతరాజంబును
నిరతము నే నాచరింతు నియమము తోడన్.

క॥ అని యతివినయము తోడను
మునిచంద్రుల పాదములకు మ్రొక్కి, ముదముతో
డను కొంత దవ్వరిగి, దీ
వన లంది యనుజ్ఞ వడసి వచ్చెన్ బురికిన్.

చ॥ కొలువున కేగుదెంచి కడు కూర్మి సుహృజ్జన మంత్రి పుంగ వా
దులఁ దిలకించి పూర్ణమగు తోషము తన్మది నుద్భవింపగా
నలరు మనోహరోక్తుల ధరాధిపు డప్పుడు పల్కె భక్తితో
నళినదళాక్షు పూజల నొనర్తు మునీంద్ర సుబోధ లొప్పగా.

క॥ హరివాసర వ్రతంబును
ధరణింగల ప్రజలు మీరుఁ దగు శాస్త్రోక్తిన్
గరమనురక్తి నొనర్పుడు
కరివరదు డొసఁగు మీకు గళ్యాణములన్.

క॥ నావుడు సభ్యులు పలికిరి
భావంబున సరి యేక వాక్యము కాగన్
భూవర భవదీయాజ్ఞను
గావించుట ధర్మ మగునుగాదే మాకున్ ?

క॥ దేవుని పూజింపు డనుచు
'దీవా నుడువంగ వలెనె ధీమంతుల కిలన్
వేవేగ ననుమ తీయుడు
పావన మగు వ్రతవిధంబు ప్రజలకు సాటన్.

సీ॥ ఆ మాటలకు మది నానంద మందుచు
విష్ణువ్రత విధంబు వివరముగను
సామ్రాజ్య మంతయు సాటించి రండని
తలవరుల ననుప తక్షణంబ
యధికారులకు తగు నాజ్ఞల గావించి
నిత్యకృత్యంబులు నెరపి పిదప
వేద విహితులగు విప్రుల రావించి
బంధు మిత్రులఁ బిలచి భక్తితోడ

తే॥ గీ॥ శుభ ముహూర్తము నందున సొంపుమీర
సంతసంబున తన ప్రియసతుల గూడి
చక్రి పూజింప దలచెను జన విభుండు
నెమ్మనంబున నత్యంత నిష్ఠతోడ.

సీ॥ దశమి యేతెంచి నంతనె సకల జనులు
ధాత్రీశు నాజ్ఞను దలంచి మదిని
నగరంబు నందలి నలు మూలలందున
భవ్య మణిమయ దీపముల నుంచి
విరివియై చెలువొందు వీధుల కిరువంక
నరటి చెట్లనునాటి యందముగను
హర్మ్యాగ్రముల యందు నతి వైభవంబుగ
రత్న దీపికలను రహిని నిలిపి

తే॥ గీ॥ చూతపల్లవ తోరణాల్ సొంపుగాను
పుష్పమాలల తోడను బొందు పరచి
ద్వార బంధము లందున వరలఁ జేసి
పురి నలంకరించిరి మనోహరము గాను.

క॥ హరిదివస వ్రతమునకై
ధరణీ విభుండొక్కచోట తగుమందిరమున్
స్థిరత నిలిపి కుడ్యంబుల
హరికీర్తనలను లిఖించి యానందమునన్.

తే॥ గీ॥ మందిరము నందు నత్యంత సుందరముగ
మండపంబును గట్టించి మహిమ మీఱ
వేదికొక్కటి నిర్మించి విష్ణుదేవు
దివ్య విగ్రహమందు ప్రతిష్ఠజేసి.

క॥ విదిశా నగరాధీశుఁడు
నదిలో స్నానంబొనర్చి నారాయణునిన్
మదిలోన సంస్మరించుచు
సదనంబు జేరి భార్య సంధ్యావళితో.

క॥ తనదగు పూజా మందిర
మున చా నాసీనుఁడగుచు ముకుళితకరుడై
ఘనమగు హరిమంత్రంబును
మనః కమలమందు నిలిపి మహిమాన్వితుఁడై.

ఉ॥ శ్రీరమణీ మణీ విమల చిత్త సరోజవిహారు భక్తమం
దారు యశోవిశాలు భవతాపవిదూరు సుధీరుమంగళా
కారు గృపాసముద్రు ఫణికంకణ పూజితు శ్యామలాంగు బృం
దారకవంద్యు మాధవుని ధ్యానమొనర్చెను మానసంబునన్.

క॥ సురుచిర కదళీ విలసిత
వరమంటప మందు వేడ్కవసియించుటకై
సురలోకారాధ్యుని శ్రీ
హరి ననుపమ భక్తితోడ నాహ్వానించెన్.

క॥ జగమిది యెల్లను పీఠం
బగునీకని మదిఁ దలంచి యబ్జాక్షునకున్
మిగుల పునీతత నలరెడి
దగు తన హృదయాబ్జ మొసఁగి నాసన మమచున్.

తే॥గీ॥ అర్ఘ్య పాద్యాచ మనముల నమరనొసఁగి
స్నాన పంచామృతములిడి సాదరమున
సురనది జలములఁదెచ్చి సొంపుగాను
చక్రి కభిషేక మొనరించె క్ష్మాధవుండు.

ఉ॥ శ్రీరమణీ కళత్ర, సరసీ రుహపత్రవిశాల నేత్ర, శృం
గార వినీల గాత్ర, రిపుఖండన నిత్ర, మహేంద్ర మిత్ర, వి
స్తార భవోగ్ర పాతకలతా శితదాత్ర, మనోజ్ఞ వక్త్ర, బృం
దారక మౌనిసంఘ వినుతా, కొనుమంచు నొసంగె వస్త్రముల్.

క॥ అజ్ఞానం బెడ బాపెడు
విజ్ఞానా స్పదుఁడటంచు వినుతించి మదిన్
యజ్ఞో పవీత మొసఁగెను
ప్రజ్ఞావంతుడగుహరికి ప్రభువరుడెలమిన్.

తే॥ గీ॥ చందనంబు నొసంగి యా సక్తి మెఱయ
నక్షతలు సమర్పించి స లక్షణముగ
వివిధరకముల విరులతో విష్ణుదేవుఁ
బూజసేయ గడంగెను భూధవుండు

సీ॥ మాధవీ చంపక మాలతీ మల్లెల
నంగ పూజలొనర్చి యచ్యుతునకు
వివిధ సౌరభముల వెదజల్లు ధూపంబు
వెన్నున కెలమితో వెసనొసంగి
దివ్యకాంతుల నీను దీపంబుఁజక్రికి
బహురక్తి తోడ నర్పణమొనర్చి
షడ్రసో పేత మౌశాక పాకంబులు
బహువిధ రుచికర భక్ష్యములను

తే॥ గీ॥ సూప పాయస మన్నంబు సూదనంబు
హరికి ముదముతో నైవేద్య మాచరించి
యబ్జనాభుని గొల్చుచు నశనముడిగి
హరిదినోత్సవ మొనరించె నవని విభుఁడు.

సీ॥ మహిమాన్వితంబగు మంగళరవములు
శ్రవణోత్సవంబుగ సాగుచుండ
వేద పారీణులౌ విప్ర గణంబుల
వేదఘోషణములు వెల్లి విరియ

విష్ణు పురాణముల్ వీనులవిందుగ
భాగవతోత్తముల్ పఠన సేయ
హరిదాసులెంతయు నాహ్లాదకరముగ
శ్రీహరి కథలను జెప్పుచుండ

తే॥ గీ॥ గాయకులు పాడ నర్తన గణములాడ
షోడ శోపచారంబుల సొంపుగాను
పద్మనాభుని గొల్చుచు పార్థివుండు
సల్పెనారాత్రి పూర్తిగ జాగరంబు.

ఉ॥ తూరుపుఁ గొండపైఁ దిరిగి తోయజ మిత్రుడు రాక-పూర్వమే
భూరమణుండు సాధుజన భూసురవర్గము తోడురా నదీ
తీరము జేరి పూతమగు తీర్థ జలంబుల స్నానమాదిల
క్ష్మీరమణీశు నాలయముఁ జేరి ప్రణామమొనర్చి భక్తితోన్.

సీ॥ గోవర్ధనోద్ధార। గోప కులోద్ధార!
నీరద గంభీర। మేరుధీర
రిపుజన సంహార। శ్రిత జన మందార
శేషాద్రి కేతన! శేష శయన!
భవ భయ నాశన। పాప విమోచన!
పక్షీంద్ర వాహన। పద్మ నయన!
వేదాంత సంచార। విజ్ఞాన సాగర।
సుగుణాల వాల! యశో విశాల।

తే॥ గీ॥ మధుర మంజుల గాత్ర। రమా కళత్ర
దివ్య కాంచనచేల వందిత కుచేల।
యర్క రుచిర ప్రకాశ। బ్రహ్మాండ కోశ।
యచ్యుతానంద। గోవింద। హరి ముకుంద।

క॥ అనుచును జగతీ నాథుడు
దనుజ విదారిన్ మురారి తాపవిదారిన్
మనమున భజించి సంతస
మున తీర్థంబును గొని గృహమున కేగి యటన్.

క॥ అవనీపతి వినయముతో
సువి చారుని చక్రధారి సురవరేణ్యున్
భువనేశ్వరు నర్చించెను
వివిధములగు కుసుమములను వేడుక తోడన్.

ఉ॥ శౌరికి ధూపదీపములు సాదరమొప్పగ నిచ్చి సజ్జనో
ద్ధారికి భక్ష్యభోజ్యములు దక్షతతో వరమాజ్య మన్నమున్
క్షీరము ఖండచక్కెరయు శ్రీఘనమిక్షు రసంబు పోళికల్
సారములౌ ఫలంబులను జయ్యన గూర్చి నివేదనంబిడెన్.

తే॥గీ॥ విడెము నీరాజనంబును వేడ్కనొసఁగి
మంత్ర పుష్పాదుల నమర్చి మహిమ మీఱ
భూసురులకు సంతర్పణంబు నొనరించి
హేమకాసులు దక్షిణ లిచ్చి పంపి.

సీ॥ ఏకాదశీవ్రత మేకాగ్రచిత్తుఁడై
యారీతిభూజాను డాచరింపఁ
బ్రభునాజ్ఞ మరువక ప్రజలెల్ల రత్యంత
భక్తి తోడను హరి వ్రత మొనర్ప
నాదేవు కృపచేత నవనీతలంబున
న్యాయంబు శోభిల్లె నలు గడలను
సకల సస్యంబులు చక్కగ ఫలియించె
దారిద్ర్య బాధలు దరలిపోయెఁ

తే॥గీ॥ చోరకృత్యంబు లడగెను చోద్యముగను
గల్ల గపటము లెచ్చటఁ గానబడక
లక్ష్మికాట వట్టగుచును లక్షణముగ
దేశ మఖిల విభవములఁదే జరిల్లె.

ఉ॥ వారిజ నాభుపూజల నవారిత భక్తిని యాచరించుటన్
దారుణపాపముల్ సమసి తత్పుర వాసులు కాలువీటికిన్
జేరక యేగుచుండిరి విశిష్టవికుంఠ పురంబుఁ జేరగా
సారసపత్రి లోచనుని చర్య లెఱుంగవశంబె? యేరికిన్,

తే॥గీ॥ కన్నబిడ్డల విధముగ గనికరమున
క్షితి తలేశ్వరు డేల నిశ్చింత తోడఁ
బుత్ర పౌత్రాభివృద్ధిని పొల్పు మీఱి
యలరుచుండిరి జనులెల్ల నప్పురమున.

క॥ నారాయణ భక్తుండగు
క్ష్మారమణుని గూర్మి ఆంత సధ్యావళియున్
సారసనాభుని గరుణో
దారత గర్భమునుదాల్చి తగవిలసిల్లెన్

సీ॥ ధవళాక్షి యనుమాట తథ్యంబు గావింప
వెలది నేత్రంబులు వెల్లబాఱె
నీలకుంతలయని నిక్కంబు దెలుపంగ
నెలనాగ నెఱికురుల్ నలుపునొందె
గురుకుచ యనియెడు గుఱుతును సూచింప
భామిని పాలిండ్లు బరువు దేఱె
ఘనతరంబగు నితంబిని యని చాటంగ
విరిబోఁడి పిఱుదలు విస్తరించె.

తే॥గీ॥ గజగమనయను వాక్యంబు నిజ మొనర్చ
మగువ నడకలు క్రమముగ మందగించెఁ
గామినియని రూఢి యొనర్ప గాంతకపుడు
మేర మీఱిన కోరికల్ మెదలె మదిని.

తే॥గీ॥ కాలపరిమితి చక్కగ గడవగానె
గ్రహములన్నియుఁ జక్కని గృహములందు
నొప్ప శుభలగ్నమందున నువిద గనియెఁ
గోటి సూర్యప్రకాశుడౌ కొమరు నొకని

క॥ సుతుఁడుద్భవించె నని విని
క్షితి పాలుండును ప్రమోద చిత్తుండగుచున్
మితిమీఱిన యాసక్తిని
సతి యుండిన పురిటియిల్లు చయ్యన జొచ్చెన్.

తే॥గీ॥ పురజనాళికి బుధులకు భూదివిజుల
కాశ్రితాళికిఁ బేదల కాదరమున
నన్న వస్త్రాదుల నొసంగి యవని విభుఁడు
నందనోత్సవమును సల్పె సందడిగను.

తే॥గీ॥ పది దినంబులు గడిచిన పిదప నృపతి
శుద్ధి పుణ్యాహమును దీర్చి శోభ మీఱ
బారసాలను గావించి బాలకునకుఁ
బ్రేమ ధర్మాంగ దుండను పేరు నిడియె.

సీ॥ ఆరు మాసంబుల కన్నంబు తినిపించె
మూడేండ్లకును దీసెఁ బుట్టు జుత్తు
నైదేండ్ల కొనరించె నక్షరాభ్యాసంబు
నిఖిలాస్త్ర విద్యల నిపుణుఁజేసె

నుత పీతుగావించె సుత్త వయస్సున
వేద శాస్త్రంబుల విబుధుఁజేసె
గజ హయస్యందన గమనముల్ నేర్పించె
ధీరునిగ తనయుఁ దీర్చిదిద్దె.

తే|గీ|| చతురుఁడైన రుక్మాంగద క్ష్మా విభుండు
బాలుఁ దొప్పెనుజనులలో వసుధయందు
దిన దినాభివృద్ధిని బొంది దీప్తి మెఱసి
సన్నుతోజ్జ్వల వైభవ శౌర్యములను.

సర్వలఘుకందము -

అనయము జనకుని యనుమతి
కనువుగ నడచుచు విమతుల నడచుచు ధరణీ
శుని తనయుఁడు భుజబలమున
వినయ నయ గుణ విభవముల వినుతిని గనియెన్.

సీ|| పుత్త్రుని జయమునుఁగొడ గాంచి మదిలోన
హర్షమందుచు వసుధాధిపుండు
పూర్ణ చంద్ర వదన పుండరీక నయన
కమనీయ మృదు గాత్ర కంబుకంఠి
సుమనోజ్ఞ కుంతల సుదతీ లలామంబు
చిలుకపల్కుల కొల్కి సింహమధ్య
త్రిభువన సుందరి యిభరాజ నిభయాన
నవ పల్లవాధర నాతిమిన్న

తే||గీ|| మాళవ ప్రభుపుత్రిక మానవతిని
చంద్రరేఖా వధూటిని శాస్త్రరీతి
నాత్మభవ రూపుడైనధర్మాంగదునకుఁ
బరిణయంబును గావించెఁ బ్రాభవమున

క॥ తన రాజ్యభార మంతయు
తనయునిపై నిడి నిరతము ధరణీ రమణున్
వినుతించుచు రుక్మాంగద
మనుజేంద్రుండుల్లసిల్లె మహిమాన్వితుఁడై.

వ॥ ఇట్లు కాలము గడుచుచుండ నొక్కనాఁడు

సీ॥ నిడుద పెన్నొసలి వేడి నీటుగ నవరించి
చక్కని మౌళిగ సంతరించి
ధవళ కాంతులతోడ ధగ ధగలాడెడి
తనువుపై భస్మంబుఁ దగనలంది
మహనీయ తీర్థ కమండలంబును జప
మాలయును ధరించి మహతిఁబూని
వక్షస్థలంబునఁ భవ్యవనమాలికలను
గటిసీమ నజినంబుఁ గడక దాల్చి

తే॥ గీ॥ విష్ణు కీర్తనల్ పాడుచు వేడ్కతోడ
జగము లందున నిత్యంబు సంచరించు
కమల సంభవసూనుండు కాలుపురికి
నపుడు విచ్చేసె సమవర్తి నరయు కొఱకు.

తే॥ గీ॥ మౌని కెదురేగి పాదపద్మముల కెఱగి
సంతసంబున దెచ్చి యాసన మొసంగి
యర్ఘ్య పాద్యాది పూజల నాచరించి
దండధరుఁ డనియె దివిజ తపసిగాంచి,

సీ॥ బ్రహ్మమానసపుత్ర! బహుళార్థ సాధక!
సజ్జన పుంగవ సంయమీంద్ర!
త్రైలోక్య సంచార! తామస మదభంగ!
వేదవీధి విహార! వినుత చరిత!

విమల యశోభూష! విజ్ఞాన సాగర!
దివిజాసురార్చిత దివ్యపాద!
భక్తమందార! భవ తిమిర మార్తాండ!
ప్రతిభాసమేత! నారద మునీంద్ర.

తె॥ గీ॥ సత్కృపాకర! మీరు మా సదనమునకు
మించు వేడుక వచ్చుట యెంచిచూడ
చవిటి భూమి ఫలించిన చందము గద!
పూర్వ భవమున మత్కృత పుణ్య మేమొ.

సీ॥ విష్ణు కీర్తనలను వీనుల విందుగ
దంబుమీరంగ గానంబు సేసి
ముజ్జగంబుల యందు ముదమునఁ దిరుగుచు
సాధు గృహంబుల సంచరించి
యజ్ఞాన తిమిరంబు నణగించు నధ్యాత్మ
విజ్ఞాన బోధయే పృథ్వియందుఁ
నిత్య కృత్యంబుగ నెమ్మది భావించి
భక్తమందారమై పరగుచుండి

తే॥ గీ॥ మహతి మొఱయించుచును మృదుమధురముగను
ముక్తినిడు మార్గ మందు నానక్తిఁజూపు
తమకు దెలియని విషయముల్ ధరణి యందు
దనరవు గదయ్య యెచటను తాపసేంద్ర.

సీ॥ పర దారలను గూడి పరగెడి పాపులు
గోవుల హింసించు క్రూర మతులు
విప్రాగ్రహారముల్ వెలకమ్ము కుటిలులు
నీతి వీడిన యవినీతి పరులు

జంకక నిరతంబు బొంకెడి హీనులు
సఖులను వంచించు చపల మతులు
బంగార మెలమిని దొంగిలించెడి దొరల్
దేవ విత్తము దిన్న కావరులును

తే॥ గీ॥ లక్ష లాదిగ నేవేళ నక్షయముగ
నన్ని దిక్కుల నుండియు దిన్నగాను
వచ్చి యీ యమపురమును జొచ్చుచుందు
రాడు నే డొక్కరుఁడును గారణ మదేమొ?

తే॥గీ॥ పాప జీవులన్ సిరులతో బలిసి యెపుడు
పూర్ణమై పరిఢవిల్లెడి పురవరంబు
జన రహితముగా నరకము లౌనదు కతన
నిండు దనమును గోల్పోయి యుండె నేఁడు,

తే.గీ॥ పాటు లేకను పడియు భ్రిటి భట గణంబు
మంత్రి చిత్రగుప్తుఁడు మది మథన పడుచు
మూల పెట్టెను చిట్టాల మూట కట్టి
రాళ్ళ పాలాయె నక్కటా రాజ్యసుఖము.

ఉ॥ పాయక లక్షలాదిగల పాపుల మూల్గులతోఁ బ్రదీప్తమౌ
నీయమ లోకమిట్లగుట కేమియనర్థము సంభవించెనో
పోయిన రాజ్యమై లభముఁ బొందు నుపాయము నెద్దియైన నా
ప్యాయత దెల్పినన్నతి కృపామతిఁ జూడుము మౌనికుంజరా।

తే॥గీ॥ అనుచు దీనుఁడై వాపోవు యమునిగాంచి
కలహ భోజను డిట్లనె కనికరమున
ధరణి రుక్మాంగ దుఁడను నరవరుండు
తనదు బంధుహితులతోడ దప్పకుండ

క॥ హరి వాసర వ్రతంబును
స్థిరచిత్తముతోడ నెపుడు చేయుచు దనదౌ
పరివార మొనర్ప నటుల
సరసతతో దీర్చిదిద్దె శ్రద్ధాళుండై

ఉ॥ కావున పాపముల్ దొలగి కాపురషాళియు పుణ్యపూర్ణమై
దైవకటాక్ష వీక్షణము దద్దయు దద్విధి పొందియుండుటన్
బోవుదు రా వికుంఠమున మోక్షపదంబును స్వీకరింపగా
తావక లోకమున్ గనరు తామసులై నను సూర్యనందనా

తే॥గీ॥ పద్మ సంభవు దరిజేరి భక్తి మ్రొక్కి
విషయముల నెల్ల వినిపింపు విశదముగను
కమలజుండు ప్రసన్నుడై కనికరమున
మార్గమున్ జూపునని చెప్పి మౌనియేగె.

సీ॥ హితము గలపి మౌని యేగిన పిమ్మట
నీరజ భవుజూడ నిశ్చయించి
శత సహస్రములగు సకల కింకరులును
బ్రీతి గొల్చుచు దనవెంట నడువ
కాహళభేరి శంఖ మృదంగ రవములు
దిశల యందెల్ల బ్రతిధ్వనింప
పంచాగ శుద్ధియౌ భవ్యకాలంబున
చక్కని ఘడియలో నొక్కనాడు

తే॥గీ॥ మహిష వాహనారూఢుడై మంత్రి గూడి
పయన మొనరించుచు గగన పథమునందు
చాల లోకములు గడచి సత్యలోక
మునకు జేరెయముడు కొన్ని దినములకును.

తే॥గీ॥ నగరి దరిఁజేరి భాస్కర నందనుండు
ద్వారపాలకుల వలన ధనదు రాక
బ్రహ్మ కెఱిఁగించి యనుమతిఁ బడసి లోని
కేగి తత్ప్రము యంబున నెట్ట యెదుట.

సీ॥ సనకాది యోగీంద్ర సంఘంబును వసిష్ఠ
వాలఖిల్యాది సప్తర్షి చయము
దేవేంద్ర సహితులై దిక్పతి స్తోమంబు
రవి చంద్ర శుక్రాది గ్రహ గణంబు
గరుడ గంధర్వ కిన్నర కింపురుష సిద్ధ
సాధ్య విద్యాధర సముదయంబు
వర్షముల్ ఋతువులు పక్షముల్ దినములు
కులపర్వతంబులు జలధు లేడు

తే॥గీ॥ నదులు నదములు గొలువంగ నవ మణిమయ
దివ్య సింహాసనమునఁ దేజరిల్లు
వనజభవు గని సాష్టాంగ వందనంబు
వినయ మొప్పఁగ గావించి యినసుతుండు

క॥ మిక్కిలి భయమును గొల్పెడి
చక్కని తన సాధనములు జలజభవు దరిన్
నొక్కొక్కటి లెక్కించుచుఁ
బెక్కింతిఁ బదిలముగ నిది వినుడని పలికెన్.

క॥ ధర రుక్మాంగద భూపతి
బరివారము తోడఁ గూడి పాయని నియతిన్
హరివాసర వ్రతంబును సు
స్థిర చిత్తముతోడ నెపుడు చేయుట కతనన్

క॥ ధరలో మానవు లెల్లరు
దురితము లఖిలమ్ము దొలగి దోష రహితులై
నరకంబు దరిని జేరక
హరి పురికే యేగుచుంది రడ్డము లేకన్.

క॥ తమ పుత్రులు పౌత్రులు నీ
నుమముతోఁ జేసెడి వ్రతంబు మాహాత్మ్యమునన్
యమపురిలో నున్న నరులు
తమ యఘము లుడిగి యరిగిరి త్వరితమె దివికిన్.

తే॥ గీ॥ నరక మందున నే డొక్క నరుఁడు లేడు
సిరులు గోల్పోయి లోకంబు చెన్ను దరిగె
నెటుల పాలింతు నింక నహీనవృత్తి
నిర్భయ నిరంకుశుండనై నేమ నేడు.

క॥ పరకాంతల మానంబును
హరియించిన వారి నశన మమ్మిన వారిన్
శరణార్థుల పీడిన భూ
వరులను హింసింపలేదు వహ్ని శిఖాళిన్.

ఉ॥ చోరులఁ గ్రూరమానసుల క్రోధితచేంద్రుల హొమ్ము తెంతయున్
ధీరత నారగించి యవిధేయత వర్తిలి సంగలావనిన్
బాతిన ద్రోహచిత్తులను భర్తల మోసము చేసి యన్యులన్
గోరుచునేగు కామినులఁ గొట్టి యెఱుఁగను గద్దహారలన్.

సీ॥ దేవుని ద్రవ్యంబుఁ దిన్న ఖలుల నంధ
కూపంబు నందునఁ గూలద్రోసి
పరకళత్రంబులఁ జెఱచిన మనుజుల
కరములఁ గత్తిచే నఱికి వైచి

యనృత మాడిన వారి నతి దారుణంబుగ
కత్తిచే నాల్క కత్తిరించి
పావన తీర్థము ల్పాడొనరించిన
ఖలుల శిరంబులు శిలల మొత్తి

తే॥ గీ॥ ఋణముఁ దీర్చని మూర్ఖులఁ కణకణ మను
నిప్పు లందిడి కొండెము ల్చెప్పువారి
త్రైల మందిడి వేయించి తగినరీతి,
బాధపెట్టి యొఱుంగను పద్మగర్భ.

ఉ॥ సోదరు రాజ్యలోభమున సొంపుగ ప్రేమ నటించి చంపి తా
నేడి యొఱుఁగి నట్లు నటియించిన వంచకుల వేగ నూనెలో
సాదర మొప్పు విందున విషాన్న మొసంగిన క్రూరు శీర్షమున్
నాదము తోడ శూలమున ముక్కలు సేయగలేదు తృప్తిగన్.

సీ॥ అగ్ని సాక్షిగఁ గొన్న యువిదల ననిశంబు
హింసల బెట్టిన హీనసుతుల
నగ్రజుని వదలి యాహ్లాదకరముగ
పరిణయ మాడిన పాప మతులఁ
దల్లిని తండ్రిని తన తోడ బుట్టులఁ
దన్ని యేడ్పించిన కాముకులను
కులధర్మమును వీడి కూటసాక్ష్యము లిచ్చి
భ్రష్టులై పరగిన దుష్టజనుల

తే॥గీ॥ మద్యపాన మొనర్చిన మందమతుల
భర్తలకు నెదురాడిన భామినులను
తగిన విధమున దండించి తనియ లేదు
జన రహిత మాయె నరకంబు జలజనూన.

ఆ|| వృద్ధులను పసిపాపలను వీధి ప్రీతి
భోజనం బాచరించిన భోగపరుల
కన్యకల నమ్మి జీవించు కల్మషాళి
నిసువ మేకుల పైనుండి యీడ్వలేదు.

చ|| అశుచిగ నుండి గోవులను హవ్యవహున్ ద్విజపుంగవాదులన్
పశువుల రీతి దాకిన యవజ్ఞుల చేతులు రెండు కాల్ప లే
దు శిశువులన్ నిరాదరత దుష్కర్మవృత్తిని చంపినట్టి వా
రి శిరము లగ్ని గుండముల వ్రేల్చగ లేదు సరోజ సంభవా.

।గీ। చిత్రగుప్తుని చిట్టాలు చెదలు పట్టి
గాల కింకర భీకర గర్వ మడగెఁ
గాలదండము త్రుప్పట్టి మూలఁ బడియె
గాలపాశము పుత్తిగఁ గచ్చు విచ్చె

।గీ|| ప్రతిభఁ గోల్పోయి యమపురి పాడు వడియె
నిర్జనం బయ్యె రాజ్యంబు నిర్జన మటు
వీని గైకొను మంచును వెతను జెందు
కాలు నోదార్చి పలికెను గమల సూతి

చ। దినకర నందనా। యిటుల ధీరత రాజ్యము నొప్పగింతు జే
కొనుమని పల్కి పాడియె యకుంఠిత నిష్ఠ వహించి భూధవుం
డనవరతం బొనర్చు వ్రత మట్టిద దాన నఘంబు లెల్లఁబా
యు నని యెఱుంగు దీవును మహోన్నత ధర్మ వివేక నైపుణిన్.

క|| ధరణీధవు డొనరించెడు
హరిపూజల మాన్పకున్న యమపురి వృద్ధిన్
బొరియ దడగింపఁ జూచిన
నరహరి కోపింప కున్నె? నళినాప్తసుతా.

క॥ గిరిధరు దలుక వహించిన
దరమే యడ్డగ నొరులకుఁ? దగిన యుపాయం
బరసి నృపాలుఁడు వ్రత మే
మఱు మార్గంబు నొనరింతు మానుము చింతన్.

క॥ హరి కెనయగు దైవము శ్రీ
హరి భక్తులవంటి మానవాళియు హరి వా
సర సద్వ్రతంబు బోలు వ్ర
త రాజముగలదె ధరిత్రి తరణి కుమారా।

ఉ॥ నీరద నీలదేహు వినిర్మల మానసగేహు దీన మం
దారు సువర్ణ చేలు గిరిధారి నకుంఠిత దీక్ష నాత్మలో
గూరిమి వ్రస్తుతించు బుధ కోటికి నెంతయు బ్రేమనిచ్చు ధా
త్రీ రమణీ మనోహరుఁడు శ్రీరుచిరోన్నత భోగమోక్షముల్

క॥ శరణన్న వారి గృప నే
మఱకే రక్షించునట్టి మాధవు డెదలో
పరితోషించిన జయమగు
ధరలో నత దలిగిన పనదరమే? మనకున్.

సీ॥ నిగమములన్ గొనిపోవు నీచసోమకు జంప
జలధిలో మీనమై జననమందె
సాగర మథనంబు సాగించు సమయాన
కూర్మమై మూపున కొండమోసె
ధరను జాపగజుట్టు దైత్యు హిరణ్యాక్షు
దునుమ వరాహమై దొరలె భువిని
తనయుని బాధించు దనుజు హిరణ్యక
శిపుని జీల్చగ నారసింహు డయ్యె

బలినుండి దేవేంద్ర పదవిని గైకొన
వామన రూపుఁడై వసుధ నొప్పె
దుష్టుల గర్వంబు తొలగించగా నెంచి
పరశురాము డగుచు బరగె ధాత్రి
రావణ కుంభకర్ణ నిశాచరులఁ జంప
శ్రీరామచంద్రుడై క్షితిని వెలసె
దౌష్ట్రిలౌ శిశుపాల దంత వక్త్రుల జంప
నుర్విపై కృష్ణుడై యుద్భవించె
హితమును బోధించి హింసల నరికట్ట
బుద్ధ స్వరూపుడై పొడమె జగతి

తే॥ గీ॥ విష్ణుయశ పుత్త్రుడై కల్కి వేషమూని
నాల్గుపాదాల ధర్మంబు సడవదలచె
నట్టి శ్రీహరి నేవేళ నాత్మ యందు
దలఁచు వారికి ముక్తి తథ్యంబుగాదె.

వ॥ భానుజా సత్కార్యములను వాని ఫలితములను వివరింతును సావ
ధానుండవై వినుము

తే॥ గీ॥ అగములందుఁ బరికింప నామలకము
చిన్న మొక్కల వీక్షింప శ్రీతులసియుఁ
బూజనీయముల్పత్రిజలకుఁ బుడమియందు
నిష్ట కామ్యముల్ హరివలె నిచ్చుకతన.

క॥ తోషణమున క్షీరాబ్ధిని
యాషాఢ సిత దశమి దినమందునఁ బ్రీతిన్
శేషాహి పాన్పునందున
శేషశయనుఁడు నిదురించు శ్రీసతి తోడన్

క॥ క్రమ్మర కార్తిక సిత ప
క్షమ్మున ద్వాదశిని మేలు కాంచును సుమ లో
కమ్మున నీ నాలుగుమా
సమ్ములు పుణ్యప్రదములు సవిత్రుకుమారా।

క॥ పై నాలుగు మాసమ్ములు
మానితమౌ భక్తితో రమా మాధవులన్
మానక పూజ లొనర్చెడు
మానవులకు మోక్షమొదవు మార్తాండ సుతా।

సీ। నిత్య కృత్యంబులు నియతితోఁ జేయక
యిలను వర్తించెడు హీనులైన
మేషమందున రవి మెలగుచు నున్నట్టి
సన్నుతమైన వైశాఖమందు
దులయందు నొప్పగ నలినాప్తుడుండ స
త్కీర్తి భాసిల్లు కార్తికమునందు
మకరంబు నందున మార్తాండు డలరెడు
మహిమాయుతంబైన మాఘమందు

తే॥గీ॥ స్నాన మొనరించినంతనే సదయుఁడైన
జలజ నాభుని కృప బాపచయముబాసి
సాధు పుంగవు లరిగెడు స్వర్గమునకు
జనియచట నివసింతురు శాశ్వతముగ.

క॥ కార్తికమున గోపూజయు
కార్తికముననిడు విశాల ఘన దీపములున్
కార్తికమున నుపవాసము
కార్తికమున విష్ణుసేవ కల్మషహరముల్

క॥ స్నానము వేదాధ్యయనము
భాను నమస్కారములును బాయని భక్తిన్
మానవుఁడు కార్తికంబున
బూనిక నొనరింపఁగలుగు ముక్తి రవిసుతా।

సీ॥ కార్తీకమందున కరమను భక్తితో
కస్తూరి మిశ్రితమౌ గంధములను
బంచామృతంబుల భవ్యతీర్థములను
హరిపూజ సల్పిన హరిజనుఁడును
హయమేధ యజ్ఞము లాచరించిన పుణ్య
మంది సాయుజ్య మందగలఁడు
కార్తికమాస శుక్ల ద్వాదశిని భూసు
రునకు భూదాన మిచ్చిన నరుండు

తే॥గీ॥ విమల విజ్ఞాన మార్జించి విష్ణుపాద
సరసిజంబుల గొల్చుచు శాశ్వతముగ
దివ్య వైకుంఠ వాసియై భవ్య సుఖము
ననుభవించు పునర్జన్మ నందకుండ.

సీ॥ భానుండు తులలోన బరగుచు నున్నట్టి
మహనీయ కార్తిక మాసమందు
సకల తీర్థంబుల స్నానమాడెడు వారు
నొప్పగ తిలదాన మొసగువారు
శ్రీహరి పూజలఁ బ్రీతిఁ జేసెడివారు
విష్ణుదేవుని కథ ల్వినెడివారు
విప్ర సంతర్పణ ల్వేడ్కఁ జేసెడివారు
నక్తంబు దీక్ష నొనర్చువారు

తే॥ గీ॥ నిందువార మువవసించి యిందుధరుని
చిత్త శుద్ధితోడ మదినర్చించుచు నభి
షేకములు క్షీర ఘృతములఁ జేయువారు
నిరతముందురు వైకుంఠ పురమునందు.

క॥ తులసీ వనదర్శనమును
తులసీదళ ధారణమును తులసీ తీర్థం
బుల సేవయు తులసీ పూ
సల జపము నరుల కొసంగు సకల సుఖంబుల్.

క॥ అనుదినము తులసి చుట్టును
ఘనముగ ముగ్గులను బెట్టి కమనీయ విధిన్
మనమునఁ గొల్చెడి సతులకు
తన నగర సుఖంబులక్ష్మి తప్పక యొసగున్.

ఆ॥ మకర రాశియందు మార్తాండు డుండగ
యజ్ఞమొకటి యిల ప్రయాగ యందు
నాచరింప నైదు హయమేధము లొనర్ప
నట్టి పుణ్యఫలమునందు నరుఁడు.

తే॥గీ॥ జగతి కార్తిక మాసాన స్నానమొకటి
యాచరించిన గౌతమియందు స్నాన
మాడిన ఫలమ్మునకు వేయి మడుగుల ఫల
మట్టి జీవరాసులకెల్ల నరసిపుత్త్రి।

సీ॥ పుండరీ కాక్షుని పూజించు నెవ్వఁడు
చెలువొప్ప నుసిరిక చెట్టుక్రింద
విప్రగణమునకు విందిడు నెవ్వఁడు
చెన్నార నుసిరిక చెట్టుక్రింద

బహు నిష్ఠతోడ జపమ్మొనర్చు నెవ్వఁడు
స్థిరబుద్ధి నుసిరిక చెట్టుక్రింద
భూదానమును జేయు సద్భక్తుఁ డెవ్వఁడు
శిష్టాళి కుసిరిక చెట్టుక్రింద

తే॥గీ॥ సొన్న ముసిరిక కాయలు సుజనతతికి
ప్రీతితో నిడు నెవ్వఁడు పృథ్వియందు
దివ్యమైన కార్తికస్నాన దినములందు
నట్టినరుఁడు హరిపురమం దనిశముండు.

సీ॥ అన్నదానమున కీ డగునట్టి దానంబు
పూజ్య గంగకుసాటి పుణ్యనదియు
కార్తిక తుల్యమౌ ఘనమైన మాసంబు
సతికంటె సుఖమిడు సరసిజాక్షి
యిందిరాప్రియునకు నెనయగు దైవంబు
ధర్మ సమానమౌ బాంధవుండు
వేదాల బరడించు విజ్ఞానశాస్త్రంబు
మహికిని జోడగు సహనవతియు

తే॥గీ॥ శాంత గుణమును మించిన సద్గుణంబు
సత్యమున కొల్పదగునట్టి సరసవాక్కు
యశమువంటి స్వరూపంబు నవనియందు
నట్టి బాంధవ పుత్త్రికః యరయలేవు.

సీ॥ శ్వానంబునకు వలె ఛండాలురకు గూడ
ప్రేమతో నన్నంబు పెట్టువారు
హీనకులజుఁడైన నింటి కేతెంచిన
ప్రేమతో నన్నంబు పెట్టువారు

నిలయంబుఁజేరిన కలుషాత్ములకునైన
ప్రేమతో నన్నంబు పెట్టువారు
నతిథియ భ్యాగతు లరుదేర దోడ్తెచ్చి
ప్రేమతో నన్నంబు పెట్టువారు

తే॥ గీ॥ పాపములు బాసి నేరుగ స్వర్గమునకు
నరిగి సకల సౌఖ్యంబుల ననుభవింతుృ
అట్టి మానవులెవ్వరు యమపురంబు
కనగ రా రెపుడును దినకర కుమార।

తే॥గీ॥ దివ్యకార్తిక ద్వాదశి దినమునందు
నొక్క భూసుర శ్రేష్ఠున కోదనమిడ
గ్రహణ కాలంబునందు గంగదటిఁ గోటి
భూసురులకన్న మొసగిన పుణ్యమబ్బు

క॥ గేహము చేరిన వ్యక్తికి
దాహమునకు తీర్థమొసఁగి తనిసిన పిదపన్
సౌహార్ద్రమున గృహస్థుం
డాహార మొసంగవలయు నానందముతో

క॥ అసమయ మటంచు నతిథిని
కసురకొనక యన్నమిడిన కలుషునియఘముల్
మసియగు నగ్నిన్ దృణమటు
విసిగికొని వెడల నడిపిన విస్తారమగున్.

క॥ నిరతాన్నదాత సెమ్మో
మరసిన సౌఖ్యంబుగలుగు నఘచయమడగున్
ధరవాని సదన వాసము
నరునకు దూరంబొనర్చు నరకపుబాధల్

సీ। ద్వారకయు నవంతి వారణాసియు హరి
ద్వార మయోధ్య కేదారములను
నైమి శారణ్యంబు రామేశ్వరంబును
అమరావతియు నరుణా చలంబు
కుంభకోణంబును కోణార్క గోకర్ణ
శ్రీకూర్మ గయ కురుక్షేత్రములను
బదరికాశ్రమమును బ్రహ్మకపాలంబు
శ్రీశైల భద్రాద్రి శేషగిరులు

తే॥గీ॥ కాళహస్తి అంతర్వేది కంచిమధుర
కోటిఫలి యహోబిల దక్ష వాటులును ప్ర
యాగ పాదగయాక్షేత్ర మన్నవరము
గనిన జనులు నీ పురికి రా రినతనూజ।

సీ॥ వసుధలో నెవ్వడు వనీయన మొనరించు
భక్తితో బ్రాహ్మణ బాలకునకు
ధరణిలో నెవ్వఁడు పరిణయంబును జేయు
విత్తహీనుండైన విప్రునకును
పుడమిలో నెవ్వడు భక్తికై గావించు
భూదాన మెలమితో భూసురులకు
నవనియందున నెవ్వ డాపదలందున
సాయంబు గావించు సజ్జనులకు

తే॥గీ॥ నభయ మొసగి మనుచు నెవ్వఁడార్త జనుల
వసతి గూర్చు నెవ్వఁడు తీర్థవాసులకును
లీలగను నెవ్వఁడే వేళ నాలమంద
నట్టినరుఁడు నీ పురికి రా డర్కపుత్త్ర.

సీ॥ శిథిల గృహములను జీర్ణాలయములను
బునరుద్ధరణ జేయు పూజ్యవరులు
వృద్ధులౌ పితరులc బృధ్వీతలంబున
సతత మారాధించు సన్మతులును
మందు వేసవులందు మానవ కోటికి
చలివేంద్రిలుంచిన సజ్జనులును
పాంథుల నీడకై బాటలకిరువంకc
దరువులునాటిన ధర్మవరులు.

తే॥ గీ॥ వరులకై పాణములనొడ్డు భవ్యమతులు
సతుల మానము గాచిన సాధువులును
జీవరాసుల కృపజూచు పావనులును
రారు యమలోకమును జూడ రవితనూజ.

క॥ తన పతితో సహగమనం
బును జేయు సతీలలామ, భూపతి కొఱకై
యని నసువుల గోల్పోయిన
జనుడును నీపురికి రారు సవితృ తనూజా.

తే॥ గీ॥ పైని పేర్కొన్న సత్కార్య ఫలము లెవ్వి
హరిదిన వ్రతఫలముతో సరియు గావు
తగు విధంబున యోచించి తరుణ మెఱిగి
చక్క పరతుపు కార్యంబు సవితృ పుత్రి।

క॥ అని అనునయ వాక్యంబుల
నిన తనయుని వీడుకొల్పి యిమ్ముగ మదిలో
దను జేయందగు కార్యం
బును గూర్చి యుజుc దపుడు తలపోయ గడంగెన్.

వ॥ అని చెప్పగా శౌనకాది మునులు సూతునిం గని యటమీది కథా
వృత్తాంతం బెట్టి దనిన

క॥ కమలదళపత్త్ర నేత్రా।
కమలాసన వినుతపాద। గరుడారూఢా।
కమలాప్త రుచిర తేజా।
కమలాహృదయాబ్జ భృంగ। కౌస్తుభ ధామా।

మాలిని। గురుజన ముని పాలా। కోటిసూర్యప్రకాశా।
సరసిజదళ నేత్రా। సత్యభామా కళత్రా।
సురరిపు మద భంగా। శుద్ధ సత్త్వస్వరూపా।
నిరుపమ గుణభూషా। నిత్య కళ్యాణతోషా।

గ ద్య ము

ఇది శ్రీ విశ్వేశ్వర వరప్రసాద లబ్ధ కవితాసంపన్న వేంకపే
శాంబా వేం క టే శ్వ ర పు త్త్ర ఆప స్తంబ సూత్ర
శ్రీవత్సగోత్ర యర్రమిల్లి శివశంకరమూర్తి
ప్రణీతంబైన ఏకాదశీమాహాత్మ్యము
నందు ప్రథమాశ్వాసము.

# ఏకాదశీ మాహాత్మ్యము

## ద్వితీయాశ్వాసము

క॥ శ్రీమానినీ మనోహర!
కామారి ప్రణుత నామ కౌస్తుభధామా!
శ్యామల నీరద దేహా!
కామితజన కల్పభూజ! కాంచన చేలా!

వ॥ అవధరింపుడని సూతుండు శౌనకాది మహామునుల కిట్లనియె.

తే॥ గీ॥ యముని పంపిన పిమ్మట కమల విభుఁడు
చేయవలసిన కార్యంబు చిత్తమందు
తగు విధంబున యోచించి త్వరితముగను
నాచరింప గడఁగె నాతఁ డొక్కటంబె.

క॥ చెలువంబంతయు నేర్పున
గలిపి యజం డొక్క రూపుగను జేసి జగం
బులు కడు నక్కజ మందగ
లలనన్ మోహిని సృజించె లావణ్యవతిన్.

సీ॥ ఇందు గుందగఁజేయు నింపైన నెమ్మోము
విండికొనలు డించు కంటి బొమలు
నట్టవత్రంబుల హసియించు నేత్రముల్
నువ్వు పువ్వును గడు నవ్వు ముక్కు
నిగ్గు టద్దంబుల నిరసించు చెక్కిళ్ళు
శ్రీకారముల నేలు చెవుల సొంపు
జక్కవగవనేలు చిక్కని పాలిండ్లు
నిసుక తిన్నెల మించు నెత్తు కటులు

గీ॥ నీలి ముంగురుల్ నల్లని నెఱికురులును
మేల్మి బంగరు బోలిన మేనితోడ
మరుని రాచిల్కయో యన మఱులుగొల్పు
భామ మోహిని నిలుచుండె బ్రహ్మ యెదుట.

క॥ నిరుపమ సౌందర్యంబున
సురకాంతలఁ బరిహసించు సుదతిని మ్రోలన్
బరికించి సరసిజ భవుఁడు
శిరమును బంకించి పలికె జేడియ తోడన్.

మ॥ ధర రుక్మాంగద భూధవుండు, సుగుణోద్ధారుండు, నిశ్చింతతో
హరివార వ్రత మాచరించి తన రాజ్యంబంద రారీతిగా
ధరణీ నాథుని గొల్చు నట్లనిశ మీ ధాత్రిన్ ప్రబోధించుటన్
బరితాపంబును జన్మభీతియును బాపంబు ల్నశించెన్ బ్రజన్.

క॥ ఆపురుషులు సైతంబును
పాపంబు లెఱుగని భాగవతుల విధమునన్
జూపరు లద్భుత మందగ
శ్రీపతి కృప నేగుచుండ్రి శ్రీపతి పురికిన్.

క॥ నిరుపమ ధృఢ నిశ్చయమతి
ధరణీశుని మది గలంచి దరహాసములన్
మురిపించి హరివ్రత మే
మఱునటు లొనరింప వలయు మదగజ గమనా।

పంచచామరము-

ధరా తలంబు నందుజూడ దాన బృంద మందునన్
ధరాధి నాథు బోలు శౌర్య ధైర్యవంతు లెందునన్
సురాదు లందు జూడలేరు సుందరాంగి యాతనిన్
మురారి పూజ మానిపించి మోహవార్ధి ముంచుమా.

॥ అని బహువిధంబులఁ బలుకు
వనజభవుని గాంచి పద్మపత్రేక్షణ మో
హిని యంతరాత్మ యందున
గనలి యనియె మిక్కుటమగు గర్వము తోడన్.

భువనైక సుందరంబుగ
భువి యందున నను సృజించి ముద్దులవట్టిన్
భువనం బందలి సతులటు
భవదీ యాత్మ న్దలఁచెదు భళిరా జనకా!

। విదిశా నగరా ధీశుని
మది నెట్లైనను గలంచి మాధవు పూజల్
వదలు నటులఁ జేయనిచో
మదీయ సౌందర్య మేల మానిను లందున్.

। సౌరభము లేని పుష్పము
భూ రమణునిచేత మెప్పు బొందని విద్యల్
పూరుషు నాకర్షించని
వారిజముఖి సోయగంబు వ్యర్థము గాదే.

॥ ఇంద్రనీల రుచుల నినుమడింపగజేయు
కుంతలంబుల నొప్పు కొమరుజూపి
పున్నమ చంద్రుని చిన్నబుచ్చఁగ జాలు
మురిపెంపు ముద్దుల మోముజూపి
మదనుని శరముల పదునును హరియించు
చుబుకైన వాల్జూపు సొగసు జూపి
పసిమి బంగరు గుండ్ల మిసిమిని హరియించు
వలిగుబ్బ పాలిండ్ల చెలువు చూపి

తే॥గీ॥ వసుమతీశుని మోహంపు వార్ధి ముంచి
తన్మయత్వము నొందించి తక్షణమున
నాదు మాటను దాటక నడచు నట్టి
చరణ దాసుని గావింతు శాశ్వతముగ

తే॥గీ॥ మోహిని పలుకులకు బ్రహ్మ మోదమంది
విమల కాంతుల రాజిల్లు వీణ నొసంగి
యిందుముఖుల సృష్టించి తోడిచ్చి దివ్య
వాహనారూఢ గావించి పంపె భువికి.

సీ॥ ఆ వాహన మపు డత్యంత వేగంబున
నుత్తమ లోకంబు లుత్తరించి
భూలోకమును జేరి పుణ్యస్థలంబులు
వివిధ జంతు విహార విపినములను
దేశ దేశంబులు దివ్యతీర్థములును
పట్టణంబులు పల్లె ప్రాంతములును
భూధర శ్రేణులు భూరి జలనిధులు
శృంగార వనములు క్షేత్రములును

తే॥గీ॥ దాటి పయన మొనర్చి మందర మనియెడు
సప్త యోజన విస్తీర్ణ శైలమందు
నిలువ నట దిగి మోహిని చెలులగూడి
సంచరింప గడంగెను సంతసమున.

తే॥గీ॥ అగము నందున మణిమయ హర్మ్య మందు
నిష్టకామేశ్వరీ లింగ మింపుగాను
వెలసి యుండుట బరికించి వెలది మిన్న
హస్తములు మోడ్చి స్తుతియించె నభవు నిట్లు,

సీ॥ నళినాప్త తేజాయ। నాగేంద్ర హారాయ।
భవ విదూరాయ తుభ్యం నమోస్తు;
మన్మథ హరణాయ। మంగళరూపాయ।
ఫాలనేత్రాయ; తుభ్యం నమోస్తు;
నటసార్వభౌమాయ। నవనీత హృదయాయ।
యమభంజనాయ। తుభ్యం నమోస్తు;
మధురాంకిత గళాయ। మహిళార్థ దేహాయ।
పరమేశ్వరాయ। తుభ్యం నమోస్తు;

తే॥గీ॥ వాక్పతి ప్రణుతాయ। తుభ్యం నమోస్తు;
యతి మనోజ్ఞ భృంగాయ। తుభ్యం నమోస్తు;
వ్యాఘ్ర చర్మాంబరాయ। తుభ్యం నమోస్తు;
భక్త కల్పద్రుమాయ। తుభ్యం నమోస్తు;

సీ॥ శ్రీ పార్వతీశ్వర। శ్రితజన మందార।
గంగాజటాజూట। గగనకేశ
కాలకూటాహార। కారుణ్య సాగర।
రజితాద్రి వాసాయ। రాజమౌళి।
భస్మలేపన దేహ। భక్త వశంకర।
కనకాద్రి కోదండ। గరళ కంఠ।
నాగాజినాంబర నటన మనోహర।
కందర్ప భంజన। కాలహరణ।

తే॥గీ॥ వృషభ వాహన। విశ్వేశ। విశ్వరూప।
నిరుపమ విభవ। నిర్గుణ। నిర్వికార।
సోమ సూర్యాగ్ని లోచన। సుజనపాల
యిష్టకామేశలింగ నిన్నెదను గొలుతు.

సీ॥ పృథివిని పొలుపారు రథము నెలయించి
సవితృ చంద్రుల నిల్పి చక్రములుగ
రహితోడ వేదముల్ రథ్యముల్గావించి
చతురాస్యు నొనరించి సారథిగను
ఘనమగు కనకాద్రి ధనువుగ ఘటియించి
నయముగ శేషుని నారిజేసి
సరసిజ నాభుని శరముగ గైకొని
త్రిపురాసురుల గూల్చి నిపుణ తలర

తే॥గీ॥ దీన జనులను బ్రోచిన దేవదేవ
ఫణి విభూషణ చిద్రూప వరమ పురుష
దుష్ట శిక్షణ సర్వేశ దురితదూర
యిష్టకామేశలింగ నిన్నెదము గొలుతు.

తే॥ గీ అని యథవు వినుతించుచు ననిశ మచట
వీణ గైకొని పాడుచు వేడ్కతోడ
చెలుల తోడను మోహిని చెలగుచుండె
శర్వు నాలయ సన్నిధిన్ శైలమందు

తే॥గీ॥ కాంతమోహిని పటువంపి కమల భవుండు
క్రూరమృగముల సృజియించి కొల్లలుగను
మహిని రుక్మాంగద విభు సామ్రాజ్య మందు
వదలెను ప్రజల నిడుమల పాలుసేయ.

తే॥ గీ॥ వన్య మృగముల్ సస్యముల్పాడొనర్చ
పల్లెలందలి జనులను పాడిపశుల
వివిధ రీతుల బాధలు పెట్టుచుండ
చేరియందఱు యోచన చేసిరిట్లు.

క॥ మనమెల్లర మిప్పుడరిగి
వినయముతో గష్టములను బృథ్వీశునకున్
వినిపింపక యూఱకొనిన
మనలేమని నిశ్చయించి, మసలకయపుడే

తే॥ గీ॥ పారితోషకముఁగాని బయలుదేఱి
కొలువునకునేగి వీక్షించి క్షోణిపతిని
యెంచితెచ్చినకానుక నెదుటనుంచి
పదములకు మ్రొక్కి వారలు పలికిరిట్లు

సీ॥ వినుము రుక్మాంగద పృథ్వీతలేశ్వర
నీదు రాజ్యమునందు నేటిదాక
గన్నబిడ్డలమాడ్కి గాపాడిపాలింప
బాధ లెఱుఁగక బ్రతికినాము
వసుధ యీనినయట్లు వన్యమృగంబులు
లెక్కిడ లేనన్ని యక్కజముగ
నెటనుండి వచ్చెనో యెఱుఁగ లేకున్నాము
సస్యములన్ని నాశనమొనర్చె

తే॥ గీ॥ పసులమందలఁ జొఱబడి యసువులణచి
యడ్డుపడిన వారలనెల్ల హడలగొట్టి
జనపదంబులయందున సంచరింప
దిక్కుతోచక యిట కరుదెంచినాము.

తే॥ గీ॥ ఎల్ల సాధనంబులఁగాని యీక్షణంబె
వేఁట గాండ్రతో నేతెంచి వేగముగను
క్రూరమృగముల ఖండించి కువలయేశ
కష్టములబాపి మమ్మిలఁ గావుమయ్య.

సీ॥ భయముతో ప్రజలాడు పలుకులనాలించి
ప్రేమతో దరిజేర్చి భీతిమాన్పి
శీఘ్రమే యేతెంచి చీకాకు గలిగించు
మృగకోటిఁ దునుమాడి మిన్నుమ్రోతు
నిండ్ల యందున జేరి యెప్పటి విధముగ
వసియించుడని చెప్పి వారిననిపి
తనయుని గనుగొని ధరణీశుడిట్లనె
వనములకేగి నేవచ్చుదనుక

తే॥ గీ॥ ప్రజలక్షేమము నరయుచు ప్రత్యహంబు
విబుధవరులు నిత్యంబును వినుతిసేయ
నీతిమార్గము వీడక నియతితోడ
నింపు తనరార రాజ్యంబు నేలుమయ్య.

క॥ న్యాయము వీడిన ధరణీ
నాయకు రాజ్యమ్మునందు నరులెల్లరు తే
జోయుతులయ్యును బృథ్విని
హాయిని సిరులను దొరంగి యడలుదురెపుడున్.

పంచ చామరము-

పురంబునందు నున్నవారి బుత్త్రులట్లు బ్రోచుచున్
నిరంతరంబు దీనకోటి నేర్పుతోడ జూచుచున్
ధరాధినాథుడెవ్వడేలు ధాత్రి నీతివంతుడై
సురేంద్రు మాడ్కి నొప్పుచుండు శోభ నారదిద్ధిరన్.

క॥ అరులనయోగ్యులఁ బ్రభునిన్
బరివారము మోసగించి వచ్చినవారిన్
దురమున దనచే నోడిన
నరులను మదినమ్మరాదు నరపతి యెపుడున్

క॥ నేరిమి, యోరిమి, కూరిమి
ధీరత సామర్థ్యముగల ధీయుతు బూర్వా
చారపరాయణు మంత్రిగ
భూరమణుఁ డొనర్ప వలయు బుద్ధికుశలతన్,

సీ॥ రాజును మంత్రి దుర్గంబు ప్రియసఖుండు
క్షితియును ధనమును సేనయనెడి
సప్తాంగములను రక్షణ యొనరించుచు
మంత్రి గోప్యతఁగల్గి తంత్ర మరసి
పనియున్ననే తప్ప బాంధవునైనను
భవనంబులోనికి బంపకుండ
దుష్ట శిక్షణయును శిష్టరక్షణయును
నీతిని బాటించి నెఱపుచుండి

తే॥గీ॥ మంత్రి సేనాధిపతులెంత మాన్యులైన
పాలనాధారమును వారిపైన నునిచి
విశ్వసించుచు మనమున విస్మరింప
క తగు విధిమెలగవలయు క్ష్మాధవుండు.

ఉ॥ జ్ఞాన ధనాఢ్యులౌ భటుల చక్కగ కొల్వునజేర్చి కొన్నవి
జ్ఞానవిశాలుడౌ నృపతి సౌఖ్యము శక్తియు రాజ్యవృద్ధియున్
మానిత సద్గుణంబులను క్ష్మాతలమందున దేజరిల్లు ధా
త్రీ నరనాథులందున సుధీరతనిత్యము సంతసంబునన్

క॥ సామంత రాజసైన్యము
క్షేమంబును గూర్చునంచుఁ చింతించిమదిన్
నేమరక మూల బలమును
భూమీశుఁడు నిల్పవలయు భూరక్షణకై

సీ॥ వాహ్యాళికైనను బార్థివుఁ డేవేళ
నంగరక్షకులతో నరుగవలయు
మధువంబు సుమమందు మధువును గొనురీతి
ధనము ప్రజలనుండి కొనగవలయు
జతురలౌ మంత్రుల హితవును గైకొని
కార్యంబు లొవరింపగ గడగవలయు
నగరంబు రక్షింప పలుదెసలందున
నుత్తమ మనుజుల నుంచవలయు

తే॥గీ॥ శత్రురాజుల చర్యలు సొంతముగను
వరగగూఢ చారులనంపి యెఱుగ వలయు
పై విధంబున వర్తించు పార్థివుండు
విశ్వ విఖ్యాతి గని యభివృద్ధినొందు.

చ॥ అవసర ముస్నదంచును ధరాధిపుడెక్కువ పన్ను వేయురా
దననివసించు మానవులకావిధి జేసినయట్టి ధారుణీ
ధవుడు ప్రజాళి మన్ననలఁ దద్దయుబాసి యనేక రీతులన్
భవికములన్ దొరగి బహు బాధలనొందు వివేకహీనత్

క॥ కరుడన్ బ్రజలను ద్రోచెడు
ధరణీనాథుని కనిశము ధనమొనగూడున్
సిరియొకచో దఱిగిన నా
దరమున దత్ప్రజయె యొసఁగు తమ నాథునకున్.

క॥ ధరణీనాథుడు ప్రజలును
ధరలోనేకస్థులగుచుఁ దండ్రియుసుతులున్
వఱలెడి విధమున మెలగిన
సిరిసౌఖ్యమ్ములను బొంది చెలగుదురెపుడున్.

సీ॥ దారుల గొట్టెడి చోరులదండించి
ధూర్తవజ ననిశంబు బ్రోచునెవఁడు
వ్యవసాయవృద్ధికై దలయు విత్తనముల
నింపుతో రైతులకిచ్చు నెవఁడు
సామ్రాజ్యమందున సంపద ఘటియించ
స్థిరవృత్తుఁడై కృషిఁ జేయునెవఁడు
భృత్యుల కష్టంబు నిత్యంబు నరయుచు
సత్కృపతోడను సాకునెవఁడు

తే॥గీ। శరణువేడిన యంతనె శత్రువులను
బ్రాణభిక్షయొసఁగ దయ గాపాడునెవఁడు
పృథ్వినట్టి పార్థివుఁ డభివృద్ధినొందు
బహు విధంబుల రాజ్యంబు వ్యాప్తిఁ జెంద.

క॥ తవివిని బొందిన క్ష్మాపతి
యును దృప్తిని బొందనట్టి యుర్వీసురుడున్
వినుమోకుమార వృద్ధిని
గని పొందగలేరు సర్వ కామ్యార్థంబుల్.

క॥ ఇటులని ధాత్రి నాథుఁడు
పటుతర శక్తియుతుఁడైన పార్థివుపై కిన్
జటిలంబగు గర్వముతో
హుటాహుటిన్ నడువదగదు యోచింపకయె.

చ॥ క్రూరుల, ద్రోహమానసులఁ, గొంకక కల్లలనాడు వారినిన్
నేరము వారలన్, జడుల, నిందకు నోర్చెడి మానవావళిన్
భీరుల మోసకారులను పెక్కురు లోభుల గొండెగాండ్ర నే
ఘోరమునుండు జేర్చెదటి బొందు నతం డిల నష్టకష్టముల్.

క॥ బలహీనుఁడు మదమత్తుఁడు
కలుషాత్ముఁడు భీరువు నగు క్ష్మాపాలునితో
దలపడిన రాజ్యంబును
బలిమిని జేకొనవలయును బార్థివుడిలలో

క॥ బలిమియు మగటిమి సుగుణము
గల భూపతితో రణమున గెలుచుక నేర్మిన్
బలిమిని బాటింప వలయు
దలపంగ ధనవృద్ధిగోరు ధాత్రీశుడిలన్.

క॥ తనలో శత్రులను గెలి
చిన మీదట బాహ్యరిపులఁ జెండాడంగాఁ
బనిగొనవలయును జతురత
సునిశితమౌ జ్ఞానముగల క్షోణీశుడిలన్

క॥ అరివచ్చి పైని బడినను
దురమందున డీకొనినను దోర్బల మొప్పన్
బరిమార్పక ధాత్రీశుం
దరిగిన దద్రాజ్యము వశమగు నన్యులకున్.

గీ॥ ప్రజల కష్టంబు లరయక పార్థివుండు
న్యాయమార్గంబు విడనాడి నడచెనేని
యన్యదేశముచేరుదు రవని జనులు
రయమున ఘటిల్లు ముప్పు దద్రాజ్యమునకు

సీ॥ సచివుల హితవును సతతంబు గైకొని
సఖ్యాది షడ్గుణ సారమరసి
సమరంబులందున జక్కగ యోచించి
సామాదితంత్రముల్ శ్రద్ధఁ జరిపి

ధర్మాది వర్గత్రితయ మాచరించుచు
మంత్ర శక్త్యాదుల మహిమ తెలిసి
సకలేంద్రియంబుల స్వాధీనమందుంచి
సప్త వ్యసనముల సత్త్వమెఱిగి

తే॥గీ॥ యధ్యయన యజ్ఞ దానము లాచరించి
దుష్టమంత్రోపదేశము ద్రోసి పుచ్చి
ధర్మ రక్షణ సేయుచు దగినరీతి
బ్రజల బాలింపవలయును బార్థివుండు.

తే॥ గీ॥ ఇవ్విధంబున సుతునకు హితముగఁబలికి
యాటవికులను గనుగొని యవని విభుఁడు
వేఁట కైరండు నావెంట విపినములకు
నిఖిల సాధనములుగొని యనుచుఁ బలికె.

సీ॥ క్షితిపాలు పలుకులు చెవి సోకినంతనే
సందడితోడ పుళింద పతులు
పేరెన్నికను గన్న సారమేయంబుల
నింపుతో శీఘ్రమే యెంచితెచ్చి
వలయు ఖడ్గంబులు వలలు తోమరములు
విల్లంబులను గదల్బల్లెములను
వేఁట కుపకరించు వివిధ సాధనములు
నారగించుట కుపహారములను

తే॥ గీ॥ సేకరించుచు తమ తమ సేనతోడ
నతిరయంబున విచ్చేసి యవనిపతికి
వినతు లొనరించి భక్తితో వినయమునను
వేఁట కేగంగ నాజ్ఞకై వేచియుండ.

క|| వనమున వేటాడుటకై
జననాథుం డేగుననుచు సఖురాండ్రనగా
విని సంధ్యావళి ప్రాణ వి
భుని సన్నిధి కేగి యనియె ముకుళితకరయై.

సీ|| పృథ్వీతలేశ్వర! వెలదియందాసక్తి
యరసిచూడగ మృగయానురక్తి
పానమందభిరుచి పలుకుప్రల్లదము ను
సొమ్ము వ్యర్థంబుగ వమ్ముసేయ
మోదమున నెపుడు జూదములాడుట
పరుషదండన మిదివరలుటయును
సప్తవ్యసనములన్ సత్యమెఱింగియు
వేటకేగదరన వింతదోచి

తే||గీ|| నిజము దెలియుగ వచ్చితి నిమిషమందె
రాజకీయ నిపుణులగు ప్రభువులీరు
పాడి చెప్పంగమీరు నేపాటిదాన
వేడుచుండి నాప్రార్థన విందురనుచు.

సీ|| వేటకతమ్మున విప్రశాపము కల్గె
ద్యూతంబు వలనను దుఃఖమొదవె
పానంబు వలనను వంశంబు మసిమాయె
స్త్రీ వ్యసనంబున క్షీణమెడలె
కఠిన దండనమునఁ గలిగెను మృత్యువు
తగని త్యాగంబున దిగులు కలిగె
పలుకు ప్రల్లదమున ప్రాణముల్వెడలెను
ధరణీతలంబున దశరథునకు

తే॥ గీ॥ బాండు సూనునకును యదు ప్రవరులకును
రావణ బ్రహ్మకు మగధరాజునకును
బలికి జేది రాజగు శిశుపాలునకును
విషయమెఱిగియు మీరిట్లు వెడలజనునె?

వ॥ అని మోమున.

సీ॥ విన్నదనముతోడ విన్నవమొనరించు
ప్రాణ సఖినిగాంచి ప్రభువరుండు
వేడుకకొఱకు నై వేటకు నరుగుట
దోషమంచెఱుఁగుదు దోయజాక్షి
క్రూరసత్త్వంబులు కుంభిని జెలరేగి
సస్యములన్నియు నాశనమొనర్చి
పల్లెలపై బడి బాధించు చుండఁగఁ
బరికించుచుండుట పాడియగునె?

తె॥ గీ॥ వలదు విలపింప నీ కిటు వనజవదన
వన్యమృగముల జెండాడి వచ్చెదనుక
హరిదినవ్రతమును జేయు మనుచు నుడివి
యాత్మజుని రాజ్యమందున నిలిపి యాక్షణంబె.

తే॥ గీ॥ సచివులును, దండనాధులు, సఖులు; హితులు,
భటులు, రథగజ తురగాది వాహనములు
తోడురా నర్క తేజంబు తోడవెలుగు
పృథుఁడు రుక్మాంగదుండేగె వనములకును.

క॥ ముందుగఁ జని శబరపతులు
తొందరగా మృగములు జను త్రోవలలో నం
దంద వలలు తడికెలుబహు
సుందరముగబన్ని మఱియు శోధించియటన్.

క॥ మెకములు తిరిగెడి సీమల
చకచక గోతులనుద్రవ్వి చక్కగవానిన్
రక రకముగు నాకులతో
నొకవిధముగ గప్పిపుచ్చి యుత్సాహముతో

క॥ శ్వానంబుల నుసికొల్పుచు
కాననమందున ఖటతతి కదలింపగా
మానసమున గలవరపడి
దీనతతో గుండెచెదరి తిరుగు మృగాళిన్.

సీ॥ అదను గనుగొని విదిశాపురాధీశుడు
ధనువును జేకొని ధైర్యమునను
వాలారు తూపుల వ్యాఘ్రాళి దునుమాడి
మత్తగజంబుల మదమడంచి
బెదిదంపుటలుగుల భేరుండ వనకిటి
శరభ సింహంబుల ధరణిగూల్చి
ఖడ్గమృగంబుల గారెనుపోతుల
శరవృష్టి ధారల సమయు జేసి

తే॥గీ॥— యేదు పందుల వృకముల నేపుమాన్పి
చమరి కస్తూరి మృగముల సరగగొట్టి
నిష్కరుణము లురలు శర నికరములను
దివ్వలిడు దుష్టాళుల జంపె గుప్పలుగను

తే॥గీ॥— అడవులం దద్భుతంబుగ నన్నిదిశల
నరదమందు స్వైరవిహార మాచరించి
క్రూరమృగములం బెక్కింటి గూల్చివేసి
ప్రజల కానందమును గూర్చె పార్థివుండు

తే॥గీ॥ వేఁట చాలించి యేగుచు విపినమందు
వింధ్యపర్వతసీమల వివిధ వృక్ష
పుష్పవల్లి కావళితోడ బొల్పుమీఱు
వామదేవుని యాశ్రమవాటి గాంచె.

తే॥గీ॥ మౌని యావామదేవుని మహిమచేత
సాధుజంతువులును గ్రూర సత్త్వములును
జాతివైరము మఱచి సంతసమున
నెయ్యమున గూడియుండును నిత్యమచట.

సీ॥ ఆ దృశ్యమునుగాంచి యాశ్చర్యమందుచు
యేముని నిలయమో యిది యటంచు
నారసి కోయెడి యభిలాష హెచ్చంగ
సత్వరంబేగి యాశ్రమమునందు
ఉచితాసనమ్మునందు ప్రవిష్టుడై యుండి
నిగమార్థముల యతి నికరమునకు
విశదపఱచుచున్న విజ్ఞాన సాగరు
వామదేవ మహర్షి వరుని గాంచి

తే॥గీ॥ సంతసంబును బొందుచు స్వాంతమందు
కలుష హరములీతని పదకమలములను
తలపుతోడ సాష్టాంగ వందనమొనర్చి
యనియె భూవిభు డత్యంత వినయమునను

క॥ గురుతర యశో విశాలా!
తరుణార్క రుచి ప్రకాశ తాపసతిలకా!
పరివాంఛిత వరదాతా
నిరుపమ కరుణాలవాల నిర్మలశీలా!

క॥ భవదీయ పునీత పదా
ర విందముల ధూళి మచ్చిరము సోకుట మౌ
ని వతంస నాదు దేహము
పవిత్రితను జెందె భవము పావనమయ్యెన్

క॥ అని యాతని బహు భంగుల
వినుతించెదు రాజచంద్రుఁడు వెస ముచితా సీ
నుని జేసి యర్ఘ్యమౌ విధ
మున సత్కారమ్మొనర్చె మునివరుఁడనియెన్

క॥ హరివంశ విభూషణ! శ్రీ
హరి చరణాంబురుహ సేవ కాగ్రేసర! భూ
వర! సచివోత్తములకు భూ
సురులకు మీసతికి మీకు సుఖమే యెపుడున్.

క॥ మర్మములనెల్ల నెఱుగుచు
నిర్మలమౌ మనసుతోడ నీతవయుడు స
త్కర్మల నొనర్చుచున్ స
ద్ధర్మము పాలించునయ్య! ధరణీనాథా!

తే॥ గీ॥ ధర్మమే జయమంచును దలఁచి మదిని
బ్రజల బిడ్డల మాడ్కి గాపాడుచుండి
హరిని పూజించు పూజ్యుడవైన నీకు
దివ్య పదమును శ్రీవిష్ణు దేవుడిచ్చు.

ఉ॥ భూవర పూర్వజన్మమున బుత్రిక నొక్కతె పొన్చనందునన్
నీవు ముదంబుతో నునిచి నెమ్మిని భూసురనౌళికిం దగన్
శ్రావణ శుక్లమందున విరాజిలు ద్వాదశినాడు భూరి సం
భావనతో నొసంగుటను భాసిలుచుంటివి రాజరాజువై.

తే॥గీ॥ తత్ఫలితముగ నీకు భూతలమునందు
పరమసాధ్వి సంధ్యావళి పత్నియయ్యె
సార్వభౌమత్వము సకల సంపదలును
హరిపదంబుల భక్తియు నావహిల్లె.

వ॥ అని నుడువుచు,

సీ॥ వామదేవ మహర్షి వసుధాధినాథుని
సర్వవిధంబున సభినుతించి
విదిశా పురాధీశ విమలయశోభూష!
భాగవతోత్తమ! ప్రణతచరిత!
మందరాచలమున మహిమాన్వితుండు గౌ
రీశ్వరుండిష్ట కామేశ్వరుండు
వాంఛితార్థములిడి భక్తుల బ్రోచెడు
కరటి చర్మధరుండు గరళగళుడు

తే॥గీ॥ శంకరుండు హితజన వశంకరుండు
వెలుగుచున్నాడు తన ప్రియపత్నితోడ
పర్వతంబిచ్చటికి సమీపంబుగాన
నతని బూజించు శుభమగు ననుచు బలికె

క॥ యతిమాటలు విని యవనీ
పతి గిరిదరి సైన్యముంచి పర్వతమెక్కెన్
శ్రితజన రక్షకుండగు పశు
పతి పాదంబులను గొలుచు భావముతోడన్.

తే॥గీ॥ బ్రహ్మ పంపిన మోహినీభామ యచట
వివిధ గీతిక ల్పాడుచు వీణమీద
సంచరించుచు నందున సఖులతోడ
పార్వతీశుని గొల్చుచు బరగుచుండె.

సీ॥ అప్సర కామిను లాటలాడుచు నుండు
స్వర్ణప్రకాశిత శైలగుహల
శిఖరాగ్రములనుండి చిత్రంబుగా జాఱు
నిర్మలోదకపూర నిర్ఝరముల
పరిమళ గంధముల్పరగున వెదజల్లు
కుసుమ సంశోభిత కుంజతతుల
భవ్యమధుర సుధా ఫలభారమునఁ దూఁగు
భూరిమనోహర భూరుహములఁ

తే॥గీ॥ క్రౌంచ కలహంస విహగముల్కలిసి తిరుగు
జలజ వికసిత రమ్య కాసారములను
మందరాద్రిపై పొడగని మనుజవిభుఁడు
హర్షవారాశిలోఁ దేలియాడు చుండ

క॥ పంచమ సుస్వర నాదం
బించుక వీనులను సోక యెటనో యని యూ
హించుచునలు దెసలను బరి
కించుటకై శిరమునెత్తి క్షితిపతి కనియెన్

సీ॥ తగిన విధంబున తంత్రుల నవరించి
స, రి, గ, మ, ప, ద, ని, స, స్వరము లన్ని
రాగతాళంబుల రంజిల్లునట్టుగా
మిక్కిలి నేర్పుతో మేళవించి
హావభావంబుల కనువగురీతిగ
యంత్ర గాత్రంబుల నలరఁజేసి
వీణనుగైకొని వేడుకతోడను
సంగీత సాహిత్య సరణి మెఱయ

సీ॥ పార్వతీశ్వర మందిర ప్రాంగణమున
నిష్టకామేశ కీర్తన లింపు మీఱ
శిలలు ద్రవియింప మోడులు చిగురులెత్త
గాన మొనరించు మోహినీ కాంతఁగనియె.

సీ॥ మెఱపు నొఱపుమీరు విరిబోఁడిమైతీరు
రేతిని మురిపించు నారిమోము
తమ్మిరేకుల నమ్ము తన్వికన్నులయిమ్ము
వింటికొనలనేలు వెలఁదిబొమలు
ముకురకాంతి జయించు ముద్దియ చెక్కిళ్లు
చివురు సొరనుగేరు సుదతిమోవి
జక్కనకవవవ్వు జవరాలి పాలిండ్లు
కుచభారమున నూగు కొమ్మకౌను

గీ॥ చిలుక పలుకుల మురిపించు చెలువనుడులు
కారుమబ్బుల హసియింను కలికి కురులు
సురుని శరముస్నాబరగు నీ మగువయెవరొ
యెఱుఁగవలె నంచుముందర కేగుచుండ.

గీ॥ అళులు కోయిలల్వెంటరా నరదమెక్కి
చెఱకు విలుకాడు ఫేగంబె యరుగు దెంచి
విరియులుంగులు సొగసుగ వింట దొడఁగి
మర్మముల నేసెగురిచ్చూచి మనుజ విభుని

క॥ విరిరాయుని యలుగులచేఁ
బరవశమున మూర్ఛనొంది వసుధా నాధుం
డొరగ_ట కనుఁగొని మోహిని
సరభసమున పొటన్నిల్పి సంతోషముతో

సీ॥ తళుకొత్తు నవరంజి తలవంచు తనుకాంతి
సహజ సౌందర్యంబుఁ జాటుచుండ
వేణిపై విలసిల్లు విరుల గుబాళింపు
నలుదెసలందున నలుముకొనగ
ముకుర సన్నిభమగు మోమున సొంపుగ
నల్లని ముంగురుల్ నాట్యమాడ
ఘనకుచ భరమున కౌనుయల్లలనాడ
చయ్యన నేతెంచి క్ష్మాతలేందు

తే॥గీ॥ శిరమునొయ్యన తనయంక సీమఁజేర్చి
జిలుగుపయ్యెద కొంగును జేతబూని
రత్నకంకణ స్వనములు రహిజెలంగ
వీవదొడగెను మోహిని పృథ్వీపతికి

ఆ॥ కొమ్మ సేవ వలన కువలయ నాథుఁడు
తెలివినొంది కాంత దిక్కుఁజూచి
యామె సోయగమున తక్కజ మందుచు
పలికెనిట్లు మధురభాషణముల

క॥ ఎచ్చట జనించితివి? నీ
విచ్చట నిల్చుటకునేమి హేతువు? జనకుం
డెచ్చట? నీ జనని యెవరు?
చెచ్చెరఁ దెలియంగ జెప్పు? చెలియా నాకున్

క॥ ఇందను కను నుల్లోకము
లందున నేజూచిన లలితాంగులలో నీ
యంఁదమును మించు సుందరి
నెందును గనలే దెదార్రమింతీ వినుమీ

క॥ మలయానిలంబులును కో
యిలల కలకలారవంబు నెలతేటిరొదల్
కలవర మొందింప దొడఁగె
నలికులవేణి నినుగాంచి నప్పటినుండిన్.

కం॥ చక్కెర విల్తుడు నాపై
నక్కటిక మొకింతలేక నలుగులనేసెన్
నిక్కమిక సైపఁజాలను
మక్కువ నీవేలకున్న మంజులవాణీ!

క॥ ఈవన శైలావృత వృ
ధ్వీవలయమునకు బ్రభుండ విదితాధిపతిన్
సేవింతురు రుక్మాంగద
భూవరుడంచును ప్రజాళిముదితా నన్నున్

తే. గీ॥ సుందరాంగులు నూర్వురు సుదతి నాకు
భార్యలందున సంధ్యావళి పట్టమహిషి
యాత్మజుఁడుకల డొకఁడు నాకామెయందు
తెలియబలికితి నాకథ తెల్లముగను

క॥ విడవక చేపట్టుము నను
దడవేమియు సైపఁజాల, తన్వీ నన్నే
యిడుములకు బాలుసేయక
వడిగా నలరింపుమికం భావజుకేళిన్

ఉ॥ వారిజ పత్రనేత్రి నినుఁ బట్టపుదేవిగఁజేసి, ప్రీతితో
నా రమణీయ రాజ్యమిది నాసచివావళి సర్వసైన్యమున్
మీరక నీదు నాజ్ఞలను మేకొనునట్లుగఁ జేయుదు న్సఖీ
నూరదు వాదుమానసము మానుము సంశయ ముల్లమందుఁ న్.

క|| ఒదయని నుడుపులు విని య
ప్పడంతి యెదమోదమంది, వసుధాధిపుతో
గడువది నా విషయంబును
విడువక విశనీదవరుతు వినుమని పలికెన్

ఉ॥ వారిజగర్భు నాత్మజను, పద్మజుసమ్మతి మందరాద్రిపై
కూరిమి నా సఖీమణులు కొల్వఁగ మోహినిపేరు తోడ నం
చారమొనర్చుచు న్నతము శంకరు పూజలొనర్చుచుండెదన్
సారస సంభవుండునను సాదర దృష్టిని జొచ్చుచుండగన్

క॥ ఆరామమ్ముల యందున
నీరామలతో జరింతు నెంతయు ప్రీతిన్
లేరెవ్వరు నను గాదని
వారించుట కింత దవక వసుధాధీశా!

క॥ పలుమాటలేల పలుకగ
నిలయందున నింతవరకు నిష్టముఁతోడన్
వలచిన మనుజుని యెఱుఁగను
వలదీ స్వేచ్ఛయని హితము పలుకుటకైనన్

సీ॥ సత్పుత్త్రి గన్నట్టి సంధ్యావళీదేవి
పట్టపురాణియై వరగుచుండ
రతికేళి నలరించు రమణులు నూర్వురు
భార్యలై యొద్దను వఱలుచుండ
భూరి విక్రముండగు పుత్త్రుఁడు నేర్పుతో
నీయాజ్ఞ బాలనసేయుచుండ
సకల భోగములందు జగతీ తలేశ్వర!
వరియించు సెన్నంచు బలికె దీవు

తే॥ గీ॥ వారలందరఁ గాదని వసుధయందు
ప్రీతితో నెట్లు ననుసుఖపెట్టగలవు
తలపునందున నాపైని వలపువీడి
పూర్వమటులఁ నీసతులను బొంది మనుము.

చ॥ అనవుడు రాజచంద్రుడనె నంబుజ నేత్ర యనంగు బాధల
న్దనువు తపించు చుండగను ధాత్రిమనంగ వశంబె? వీడినిన్
మనమున నందియుంబుడుగు మాటమీఁగూర్తు మహేశు సాక్షిగా
ననిశము నీదు మాటకెదురాడను చూడను నాదు భార్యలన్

క॥ నా రాజ్యము ప్రజలందఱు
నారాణులు నాసుతుండు నాసర్వస్వం
బో రామా నీవేయను
చా రాజముఖిని ముదంబు నందగ జేసెన్.

తే॥గీ॥ తగు విధాన తృప్తి పఱచి తక్షణంబె
రాజ పుఁగవుడింపుతో రాజముఖిని
పార్వతీశ్వరునాలయు ప్రాంగణమున
భవుని యెదుట గాంధర్వ వివాహమాడె.

వ॥ పిమ్మట

తే॥ గీ॥ సాంధ్య కృత్యములనుదీర్చి చక్రవర్తి
తరుణితోడ గౌరీశు మందిరమునందు
నిష్టకామేశ లింగంబు నెదుటనిలిచి
యంజలి ఘటించి శర్వుని ట్లభినుతెంచె

తే॥గీ॥ ఇష్టకామేశ నినుమది నెవడు కొలుచు
వానికోర్కెలు సిద్ధించి వసుధలోన
జన్మదుఃఖాది రోగముల్సమసిపోయి
యిష్ట విభవముల్ధరణిలో నందకున్నె?

ఉ॥ లింగ! సుగంధ చందన విలేపిత రమ్యశుభాంగ! భస్మితా
నంగ! ధరాశతాంగ! భవనాశ! మహోక్షతురంగ! స్వర్ణవ
ర్ణాంగ! గిరీంద్రజా ప్రణయినీలాత్మ సరోరుహభృంగ! సంగరా
భంగ దయాంతరంగ| ఘనవార్ధి నిషంగ! శశాంక శేఖరా!

వ॥ అని వివిధ విధంబుల భక్తి శ్రద్ధలతో

తే.గీ॥ శివుని బొగడి ప్రసాదంబు స్వీకరించి
దేవళము వీడి మోహినీ దేవితోడ
చంద్రకాంతుల శోభిల్లు శైలమందు
సంతసంబున నందందు సంచరించి

తే॥ గీ॥ పర్వతంబున నొకపుష్ప వాటియందు
వివిధ సౌరభములతోడ వెలయుచున్న
మల్లికాకుంజ మంజుల మంటపమున
పూలసెజ్జను జేరె బూతోఁడితోడ.

తే॥ గీ॥ మోము మోమున భుజములు భుజములందు
నురమురంబునఁ దొడలనలరగ దొడలు
కలిపి పదములు పిక్కలొకటిగ మలచి
యొకరి కౌగిటిలో మరియొకర డంగి

తె॥ గీ॥ అనిశ మొకరి మతొక్కరు హత్తికొనుచు
దనువు లొండొంటి తోడను పెనలువైచి
యురుభుజంగములను బోలి సురతియందు
సౌఖ్య వార్ధినోలాడి రా సతియు పతియు

క॥ ఈవిధముగ వారు భయులు
భావజు సంగరమునందు బటు చతురతతో
నే వొకరు వీగిపోవక
వానిరి సమరతులందేలి వర్తిలిరెలమిన్

క॥ ఈవిధముగ వారుభయులు
ద్వావజా సంగరము నందు బటు చతురతతో
నేవారు పీఁగిపోవక
వావిరి సమరతులఁ దేలి వర్తిలి రెలమిన్

తే॥గీ॥ అనిశీథి చిత్రగతుల_నటు బెనఁగుచు
సురతమున నలసి సొలసి-యిరువు రచటి
విరుల పాన్పున శృంగార విభవ మలర
నొడలు మఱచి నిద్రించి రే గడియ లోనొ

క॥ వెలవెల బాఱెను జుక్కలు
కలువల రాయుఁడును గ్రుంకె గాకులు కూసెన్
గలువల వికాస మెడలెను
గలకల మని పల్కె పక్షిగణ మెల్లడలన్

క॥ కమలాప్తుం డుదయించెను
కమలంబుల సహజ రుచులఁ గమలాకరముల్
గమనీయంబై యొప్పెను
సుమనోజ్ఞం బైన బాలసూర్య వశిఖలన్

తే॥గీ॥ సవితృ కాంతులు పైనోకి జనవిభుండు
తనదు దిన కృత్యములదీర్చి త్వరితముగను
సచివరాంద్రుతో వచ్చిన సఖియతోడ
సరసునందున జలకేళి సలిపి పిదప

తే॥గీ॥ ఫలకుసుమ భరితంబగు వనమునందు
చక్కని ఫలపుష్పము లను సంగ్రహించి
భూతనాథుని గుడికేగి పూజచేసి
తత్పదముల పైబడి భక్తి తత్పరతను

ఉ॥ శంకర పార్వతీ హృదయ సారసభాస్కర। చంద్రశేఖరా।
పంకజమిత్ర శీతకర పావకలోచన। కాలకంధరా।
సంకట దూరసజ్జన వశంకర వ్యాఘ్ర గజాజినాంబరా।
పంకజనాభ పుత్త్రినుత పాదసరోరుహ నిర్గుణాకరా।

తే॥గీ॥ అనుచు నద్దేవు ప్రార్థించి యతివతోడ
విశ్వనాథు ప్రసాదమున్ స్వీకరించి
ముదముతోడ రుక్మాంగద భూవిభుండు
మందిరము వెలువడి వచ్చె మగువగూడి

వ॥ మోహిని చెలికత్తెలామెకు వీడ్కొలు తెలిపి వెడలిరి అపుడు రాజేం
ద్రుఁడు మోహినిని జూచి,

సీ॥ పంకజవదన నా పరివారమంతయు
పీడితి గిరిదతి విపినమందు
శీఘ్రమే పయనించి చేకొని వారల
నగరికి నరుగుట నయముకాదె?
సామ్రాజ్యముండియు సౌఖ్యంబు బడయక
కానన భూముల గడపనేల-
వేగమే రమ్మని వెలదిని దోడ్కొని
శైలంబు దిగివచ్చి క్ష్మాధవుండు

తే॥గీ॥ చతుర మతులగు గురుమంత్రి సత్త్ములను
నతుల విక్రములగు చమూపతుల కలిగి
గజతురంగాదులును వేఁట గాండ్రినలరు
బలగమును జేరి సంతోష వార్ధిఁ దేల్చె.

తే॥గీ॥ ఆ సమయమందు ప్రభువాంచి యాతని హయ
మధిక సంతోషమున నుర్వి యంఘ్రి దర్పి
నా స్థలంబున నేలలో నణగియున్న
బల్లి యొక్కటి గాయపడె తత్పాదహతిని

తే॥ గీ॥ గాయపడి బాధ నొందెడు గొలిగాంచి
కరముతోడను పైకెత్తి కనికరమున
యుక్తమగు తావునన్దాని నుంచి విభుఁడు
శీతలోపచారములను జేయుచుండ

ఉ॥ మానవ నాథుకృత్యములను మానిని మోహినిగాంచి, ధాత్రిలో
హీనపుజాతి పుర్వనుచు నెవ్వరుముట్టరు దీనినంటినన్
స్నానము చేయఁగావలయు; సర్వమెఱింగిన రాజచంద్రవి
జ్ఞానమువీడి దీనికుపచారమొనర్తురె? మానిరండనన్

సీ॥ ధరణీశు కరములు తనువు సోకినయంత
పాపవిముక్తియై బల్లియపుడు
భామ మోహినియన్న పలుకల నాలించి
మనుజ భాషణమున మగువకనియె
యజ్ఞంబు లెన్నొని యాచరించుటకంటె
ధర్మంబు లొనరించి తనరుకంటె
ప్రాణరక్షణసేయు ఫలితమధిక మంచు
వేదములు చాటుట వినగలేదె?

తే॥ గీ॥ కనికరంబును మించు చక్కని గుణంబు
నధిక మత్సరంబును బోలు నవగుణంబు
విరహమును మించు రోగంబు ధరణిలేవు
వినుఁడు నాజన్మకధనంబు విశద పఱతు

సీ॥ ధరణీశ! కాపిల్యపురము నివాసంబు
నాభర్త గృహమున నన్ను వీడి
పరభామలను గూడి తిరుగుచు నిత్యంబు
రాత్రులందిందిటికి రాకయుండ

ద్విజులను రావించి ప్రియుడునన్నాడునా
తెలుపుదంచును గ్రహబలము నడిగి
వల్లభుదు నన్ను జేపట్టునా చెపుడని
సోదెగాండ్ర పిలిచి సోది యడిగి

తే॥ గీ॥ సిద్ధులాండ్రను యోగులఁ జేరబిలిచి
వలపు మందులఁ జెపురని బత్తిమాలాడి
తగు నుపాయంబు నెఱుగక తల్లడిలుచు
కాలమతి కష్టపడచును గడుపుచుంద

తే॥ గీ॥ మాపురంబున కపుడొక మంత్రికత్తె
వచ్చి నాచేత నిడెనొక వలపుమందు
పాలతోడను దీని నీభర్త కొసగు
నీకు వశయుక్తుడై యుండు నెలతయనుచు,

క॥ మంద నుసి గైకొని యా
నందముతోఁ బాలకలిపి నా ప్రభువునకున్
సందేహింపక యిచ్చితి
ముందిక నను వలచునంచు బోధించుటచే

క॥ దయఁ జూచునని తలంచుచు
ప్రియునకు నేనిడినమందు విషమించుటచే
రయమున విదాహ మేర్పడి
భయమడినే జూచుంద ప్రాణము వీడెన్

సీ॥ కపటౌషధంబునఁ గాంతున కొసగిన
కారణమున నన్ను కమల భవుఁడు
బల్లిపై జన్మించి బ్రతుకు మటంచును
శాపమిచ్చుటచేత జగతియందు

గృహగోధికగ పుట్టి బహుళ కష్టములొంది
చిక్కులయందున జిక్కియుండ
పావనమగు నీదుస్పర్శ పాపమెడలి
పుణ్య లోకంబును బొందుచుంటి

తే॥ గీ॥ ననుచు స్త్రీరూపమును దాల్చి తనకు దివిజ
పురమునుండియే తెంచిన పుష్పకమున
నూర్ధ్వలోకము దిశకేగె నుర్వివీధి
యచటి వారందరాశ్చర్య మందుచుండ

వ॥ అని సూతుండు చెప్పగా శౌనకాదిమునులు మీది కథావిధానం
బెట్టిదని యడిగిన.

క॥ సరస దయాపాంగ! గరుడ
తురంగ! శ్రీవిమల హృదయతోయజ భృంగా
సురమౌని సన్నుతాంగా!
వరభక్త జనానుషంగ! శైరివిభంగా

తోటకము

శరణాగత బాంధవ! శైలధరా
సురరాజ శుభంకర! శూరవరా!
ధరణీధర మందిర! దైత్యహరా!
పరతత్త్వ విహార! కృపానిలయా!

గద్యము

ఇది శ్రీ విశ్వేశ్వర వరప్రసాద లబ్ధకవితా సంపన్న వేంకటేశాంబా వేంకటేశ్వ
పుత్త్రి అపస్తంబ సూత్ర శ్రీవత్సస గోత్రీయ ద్రమిల్లి శివశంకర
మూర్తి ప్రణీతంబైన ఏకాదశీ మాహాత్మ్యమునందు
ద్వితీయాశ్వాసము.

—:o:—

# ఏకాదశీమాహాత్మ్యము

## తృతీయాశ్వాసము

శ్రీరమణీ హృదయకమల
సారంగా! భానుతేజ! సదమలశీలా!
కారుణ్యామృతసాగర!
వారిజ దళ దివ్యనేత్ర! భవ్యచరిత్రా!

వ|| సూతుండు శౌనకాది మహర్షులకు మీదికథ నిట్లని చెప్పఁదొడఁగె.

సీ|| తన జన్మచరితంబు వినిపించి యాబల్లి
శాపవిముక్తయై చనిన వెనుక
నాటవిక శబర యవనాది నరపతుల్
పరివారయుతముగ ప్రక్కనడువ
విక్రమోన్నతులగు వివిధ చమూపతు
లుభయపార్శ్వంబుల నొప్పుచుండ
చతురంగ బలములు సముచిత స్థలముల
ననురక్తితోఁ జేరి యనుసరింప

తె|| గీ|| ఢక్క దుందుభి స్వనములు దిక్కులదరు
నరతిగదలె రుక్మాంగదజనవిభుండు
హేమ మణిరథా రూఢుడై యింతితోడ
శీఘ్రమే రాజధానిని జేరుకొనగ

క|| చరణంబుల ఘట్టనలను
ధరణీచక్రంబు క్రుంగి తల్లడమందెన్
త్వరితపు గమనము చేతను
బరగిన పెంధూళి గగన భాగము గప్పెన్.

క|| తనబలముతోడ నీ విధి
జను రుక్మాంగద నృపాల చంద్రు నిరాకన్
గనుగొని సామ్రాజ్య వ్రజ
మన మునముదమంది వచ్చు మార్గమునందున్

క॥ దారికి నెదురేగి నిలిచి,
గౌరవమున దెచ్చి పెక్కుకానుకలీయన్
ధీరమణుఁడు వానిని గొని,
వారిని గూరిమి నరయుచు బయసమొనర్చెన్

చ॥ జనపతి నాడువచ్చునని, చారులు చెప్పగ సంతసంబునన్
దనపరివార మంతటిని తక్షణమందున బిల్వనంపి రా
జనగరు తత్పురంబు నతి చక్కనిభంగి నలంకరింపగా
బనిచి నృపాలనందనుఁడు పార్థివచంద్రుని చూచు వేడ్కతో

క॥ చతురంగ బలముతోడను
జతురోత్తములైన మంత్రి సామంతులతో
శ్రితుల నెఱిఁగిన పురోహిత
తతితో నెదురేగి సుతుఁడు తండ్రికి మ్రొక్కెన్

సీ॥ పద కమలంబుల పైనున్న పుత్రుని
దీవించి శీఘ్రమే లేవదీసి
కులదీపకాయని కూర్మికౌగిట జేర్చి
రాజ్యమేలుదె? ప్రజారంజకముగ
క్షేమమేకద మన శ్రితజనులెల్లరు
నీయాజ్ఞ పాలింత్రె నిజనంబు?
సాగుచునున్నవే సత్కలాపంబులు
పుడమి ఫలించునె పూర్వమట్లు

తే॥ గీ॥ విశద వఱుపుమంచు నడిగి వివరమెఱిగి
హర్షపుల కాంగితుఁడగుచు నాత్మ నలరి
తనయు ధర్మాంగదుని తోడ ధరణి విభుడు
పలికె నీరీతి మోహినీ భామజూపి

క॥ విను గాంధర్వ వివాహం
బున మందరమున వరించి ముదమున నీకాం
తను దెచ్చితి, నజుమానస
తనూజమోహిని యనంగ ధరణిన్ బరగున్

తే॥ గీ॥ జనని నీకగు కావున శంకవీడి
తగిన సత్కారములతోడ మగువనింక
అలరింపక కొనిపొమ్ము నంతిపురికి
అనుచు దనయుని ధర్మాంగదుం బనిచి సిదప

సీ॥ వర్ధిభు విక్రమంబును వరివరి విధముల
వేడ్క వందిజనులు వినుతిసేయ
పురమున వసియించు పుణ్యాంగ నావళి
శిరమందు బ్రీతితో సేసలిడగ
విజ్ఞానధనులగు విప్రవర్గంబులు
వేదమంత్రమ్ముల దీవించుచుండ
మంత్రివరులును సామంత రాజులు
నుల్లయ్య పార్శ్వంబుల నొప్పుచుండ

తే॥గీ॥ భద్ర గజముపై యూరేగి వట్టమందు
నగరు ముందున తన వాహనంబును డిగి
రాజ భవనంబు నందున రమ్యముగను
కొలువు దీర్చె రుక్మాంగద క్షోణి విభుండు

తే॥గీ॥ ప్రజలక్షేమము నారసి వారిననితి
సచివులందరి వీడ్కొని సాదరముగ
సభను నాటికి చాలించి సత్వరముగ
నరిగె నంతిపురంబున కవనీ విభుండు

క॥ పతి వచ్చుట గని యాతని
సతులెల్ల రెదురుగ నరిగి చరణంబులకున్
నతులొనరింపంగా కరు
ణతోడనం దరినిజేర్చి నరపతి పలికెన్

సీ॥ సతులార మందర శైలంబు నందున
నీశ్వరు వీక్షింప నేగినపుడు
శూలి సన్నిధినున్న సుదతి మోహినిగాంచి
వరియింపు నన్నని వనితనడుగ
నిపుడున్న భార్యల నెవ్వరి గూడక
నాయాజ్ఞ మీఱక నడుచుకొన్న
గైకొందు నిన్నని కన్నియ నుడువంగ
నంగజు శరఘాతి కాగలేక

తే॥గీ॥ మాట జవదాటననుచును మాటయిచ్చి
భామఁబెండ్లాడి చేకొని వచ్చివాడ
కూర్మికోడను మిమ్మిక గూడ జనదు
మీరునాయాజ్ఞ పాలించి మెలగవలయు

క॥ ముకుకులవలె జెవినోకిన
పలుకుల కతమున గలిగిన భయకంపమునన్
గలవరమందుచు మనమున
పలికిరి మానినులు ప్రాణ వల్లభుతోడన్,

క॥ ఎనలేని చక్కదనమున
నను రక్తిన్జూపు నూర్వశంగన లెపుడున్
నిను వలచియుండగాదని
మనసిచ్చుట తగునె యొక్క మానినికొఱకై.

తే॥గీ॥ అన్యకన్యల వలచి పెండ్లాడజూచి
సమ్మతించుసుగాని యేసతియు నైన
యువిధ నొక్కతె జేపట్టి యున్నవారి
బొమ్మన సహింప గలదొకొ? భూవరేణ్య!

క॥ ధరణీశ్వర యామోహిని
పరికింపగ నందమైన వనితయె మాయం
దతికంటె భ్రమయె కాకది?
వరులిడు కూరరుచి యనుట వరిపాటిగదా?

ఉ॥ అక్కట సుందరాంగులగు నంగనలం దఱఁ గ్రూరచిత్తతన్
జక్కెరవింటిజోదు సుమసాయకబాధల కొప్పగింతురే?
యక్కటికంబు వీడియిటు లార్యులొనర్చుట న్యాయమౌ నొకో?
యొక్కలతాంగిపొత్తునకు నొప్పనెయుందఱఁ ద్రోసిపుచ్చగన్

క॥ సుందరి మోహినితో పా
టందఱఁ గృపనేలుమయ్య! యటుగాదా నీ
ముందఱ నసువుల వీడెద
మందఱ మని వగపుతోడ నాడిరిసుదతుల్

తే॥ గీ॥ వారిమాటల నాలించి వారితోడ
పట్టమహిషి సంధ్యావళి పలికెనిట్లు
తప్పునొప్పుల నరయక ధారుణముగ
విభుని దూఱుట పాడియే? వెలదులార!

ఉ॥ కోమలి నొక్కతెన్ బ్రియుడు కోరికతోడ వరించితేక ముం
దేముటియైన జెప్పనగు నిష్టముతోడను దెచ్చి కాంతుడే
కామినినైన గూడనిటు కాదనకుండ సుదారబుద్ధితో
సామజ యానలుందుటయె, సాధ్వుల ధర్మమటం చెఱంగరే?

ఆ॥ ఆదరించి ప్రేమనానంద మొసగిన
నాగ్రహించి కొట్టి యన్నమిడక
యిల్లు వెడలగొట్టి యిక్కట్లు పెట్టిన
భర్త భర్తగాడె భామినులకు

ఆ॥ తల్లి, తండ్రి, గురుఁడు, దైవంబు తలపగ
ధవుఁడుగాదె సతికి ధరణియందు?
నట్టి ప్రాణనాథు నభిరుచి కాదన
భావ్యమౌనె మనకు వదతులార

క॥ అసువులు వీడెద మంచును
విస విసలాడుచు వలికిరి విభుసన్నిధితో
బొసగునె ప్రాణంబులుడగ?
దొసగగు సతికి ప్రియుసమ్మతులు గొనకున్నన్

క॥ ఈ మగునయందు ముక్కువ
భామీశున కెంతవలుకొ హొదగందుముగా?
మీమది సహనంబు వదలి
భామినులార దిగు లొందభావ్యంబగునే

సీ॥ సంధ్యావళీ రీతి సవతులకు పతివ్ర
తా ధర్మములను బోధ యొనరింప
చింతించుటను మాని చేడియలెల్లరు
సమ్ముదంబున తమ సదనములకు
నరిగిన పిమ్మట నవనీతలేంద్రుఁడు
సామ్రాజ్ఞి రమ్మని సాదరముగ
వివిధ భూషణములు విలువైన వలువలు
పరిమళద్రవ్యముల్ పెరిమనొసఁగ

తే॥గీ॥ పరమభక్తిని గైకొని పతికి మ్రొక్కి
యచట నిలుచట తగదని యాత్మనెంచి
భర్త యనుమతి గానియేగె పట్టమహిషి
శీఘ్రమే భవనాంతర సీమకపుడు

సీ॥ రాజును వీడ్కొని రాణి చనినయంత
మోహిని తోడను భూవిభుండు
శశి శిలా నిర్మిత సౌధరాజము నందు
దివ్యకాంతులతోడ దేజరిల్లు
నంతఃపురంబున కరిగి యచట నొప్పు
వివిధమౌ మణిమయ వేదికలను
సుమరాజి తోడను శోభిల్లుచును సుగం
ధ మొనగూర్చెడి మృదుతల్పమందు

తే॥గీ॥ సంతసించుచు నాతఁడు సతినిగూడి
బయటకేగుటయె మఱచి పవలురేయి
మదన సామ్రాజ్యమేలుచు మసలుచుండె
సకల కార్యముల్పుత్త్రి వశఁబొనర్చి

ఆ॥ కూర్మితోడ జూచు కోమలి చేవేళ
నలుకజెంద లలన యడలుచుండు
సతివ మాటకెపుడు నడ్డంబు సలుపడు
నెలత వీడడొక్క నిమిషమైన

క॥ పెరిగెను వనములు గుబురుగ
వరలెఁ బురద యుడిగి జలము స్వచ్ఛంబగుచున్
దరిగెను వెల్లువ నదులను
శరదృతు వరుదెంచినట్టి సమయంబందున్

క|| జలజంబులు వికసించెను
గలహంసలు తిరుగఁ జొచ్చెఁగాసారములన్
గలమాది పైరు పరటలె
నిలకనులకు లక్ష్మివోలెయింపై తోచెన్

క|| సరసిజ నాభుఁడు మేల్కొనె
శరదాగమనమ్మున క్షీర సాగరమందున్
సురగణమును మౌనివరులు
సరసిరుహ నేత్రుఁ గొల్వఁ జాగిరి ప్రీతిన్

క|| హరిహర పూజల తోడను
గరమానందమ్మునుగూర్చు కార్తికమందున్
ధరణీశుని గిరి యనఁగ
సురచిర దీపమ్ముల పురి శోభిలుచుండెన్

క|| పవలును రేయియు విడువక
యువిదను [illegible]తో
భవనమునందే యుండెను
భువనేశ్వరుం[illegible]మ్ము చేతన్

సీ|| పూర్వపురీతి [illegible] తలవరుల్
సాటిరి [illegible]ముగ సమయమెఱిఁగి,
దశమి దినమ్మున [illegible] నొకపూట
శ్రీహరిం గొల్చి భుజింపవలయు,
హరివాసరంబున నాహారమ్మున్ మాని
కమలాక్షు పూజల గడపవలయు
ఉ|| ద్వాదశి [illegible]
[illegible]

తే॥ గీ॥ సత్కరింపవలయుఁ దనశక్తి కొలది
జన్మ సాఫల్యంబునకిది సాధనంబు
నఖిల జనులకినిది ప్రభునాజ్ఞసుండు
తప్పట క్షమింపరానట్టి తప్పసుండు

ఉ॥ ఈవిధి చాటుటన్ విని నరేంద్రుడు కౌగిటిలోని మోహినీ
దేవిసవీడి భూస్థలికి దిగ్గనఁజేరి హరిన్ స్మరించుచున్
సేవలు చేయుచుండగని జేడియ నల్కయు సిగ్గు పెన్గొనన్
భూవరుఁడాసెఁ జారివడు పుట్టముఁగొప్పును జేతపట్టుచున్

పంచ చామరము

నరేంద్రుఁజేరి ధారుణీశ! నన్ను లెక్క చేయకే
బిరానవీడి వచ్చితేల? విభ్రమంబు కల్గెడిన్
మురారి గొల్చు హేతువేమి మోహమీవు వీడుచున్?
మొఱంగ కిప్పుడంత నాకు ముందెఱుంగ జెప్పుమీ

క॥ సదమల చిత్తము తోడను
ముదవతులను గూడి సతము మన్మథకేళిన్
వదలక చరించు వారలు
సుదర్శనుని గొల్వఁ జూడ జోద్యంబయ్యెన్

వ॥ నావుడు రాజచంద్రుడు మోహినీ కాంత కిట్లనియె

తే॥ గీ॥ కొనలు సాగెడు నీమీది కోర్కె నేను
వదల సాధ్యమగునె యింత త్వరితముగను?
సంశయంబును వీడి నీస్వాంత మందు
నంబుజానన నామాట లాలకింపు

వ॥ చంద్రవదన నాదాచనేల? నేనేకాదశీ దినంబునందే స్త్రీలను కూడను
హరిదిన వ్రతంబును నియమముతో చేయుదును,

ఉ॥ భామిని నీవు దీక్షగొని భక్తజనావను పద్మనాభునిన్
నీమముతో హృదబ్జమున నిల్పి భజింపుము సత్కృపార్ద్రుడా
సామజ రక్షకుండొసఁగు స్వాంతమునన్ దనుగొల్చువారికిన్
గామిత భోగభాగ్యములు కల్ప మహీజము భంగి ప్రేమతో

క॥ హరి కీడగు దైవంబును,
హరివ్రతంబునకు సాటియగు సువ్రతముల్
మురహరి పూజకు సరియగు
సురార్చనలులేవు సుదతి, శోధింపంగన్

సీ॥ తామరసాక్షుని తగురీతి సాత్మలో
దప్పక ననిశంబు దలచుటయును
మాధవు రూపంబు మనసునందే వేళ
నిగ్రహంబు వహించి నిల్పుటయును
శ్రవణ పేయంబుగ శివునికీర్తనలను
పరవశత్వముతోడ పాడుటయును
జిహ్వకొలందిని జిష్ణుని గాథలు
బాగుగ వర్ణించి పలుకుటయును

తే॥ గీ॥ వాసుదేవుని చిత్రముల్ వ్రాయుటయును
చిత్తశుద్ధితోడ హరినర్చించుటయును
మురహరి పదాంబుజములకు మ్రొక్కుటయును
సకల సౌఖ్యప్రదంబులు సారసాక్షి

క॥ ధరణీశుని మాటలు విని
సరసీరుహ వదనయనియె సౌఖ్యము కొఱకున్
హరిగొలువంగా నేటికి
సురత క్రీడాతులయుకు సుమశరుడుండున్

తే॥గీ॥ నిమిషమైనను నిన్నుబాసి నిలువలేను
మన్మథ క్రీడలనువీడి మనగలేను
సతులకు భయమువదీ వలుకు సాకులంచు
మదికి తోచుచున్నది నాకు మానవేంద్ర।

సీ॥ రత్న విరాజిత రమ్య మందిరముల
నఖిల సుఖంబుల కదనుగలిగి
యుద్యాన వనముల నుత్సాహ మొప్పగ
విరిసెజ్జ విహరించు వీలుకలిగి
తూగుటుయ్యాల లందు నూగుచు ముదమ్మున
సొగుటకు నవకాశంబుఁ గలిగి
కేళికాసరసుల గ్రీడించు చనిశంబు
జలకేళి సవరించు చెలువుకలిగి

తే॥గీ॥ యిష్ట మృష్టాన్న సంపద లెన్నొకలిగి
వాసుదేవుని పూజలు వ్రతములనుచు
వస్తులుండగ నేటికో పార్థివేంద్ర
యక్కునను జేర్చి వేగనన్నాదరింపు

సీ॥ అగజా మనోహరు ననిశంబు గొల్చుచు
మందరనగమున మనుచునున్న
ననుగని మోహించి నాననివ్వోధికి జేరి
గాంధర్వరీతి నన్గలియునపుడు
నీమాట క్రిద్దుర్గాద నిన్నుబాసి యొవ్వడు
గడియకాలము గూడ గడపననుచు
వరమేతు మంద్రిరద ప్రొట్ల గజ్జామంత్రమ్మున
బలినగై కొని తెచ్చి వ్రతములనుచు

తే॥గీ॥ పతివలను బిడ్డలను వీడి యడవులందు
గందమూలము లుభజియించి కడుకృశించు
మునుల విధమున నుపవాసముల మనంగ
నఖిలషింతువేల నృపకులాబ్ధిచంద్ర।

ఉ॥ పన్నగభూషణున్ హృదయ పద్మమునందున గొల్చుచున్ననా
కన్నెఱికంబు జారగాని కామునివారికి నప్పగింతువే
యెన్నడు నాడితప్పరు దినేంద్రుని వంశజులంచు గ్రుద్ధిగా
నిన్నెద నమ్మినట్టి ననునీతివి వీడి నృపాలశేఖరా।

క॥ పరమేశుని సేవలకున్
ధర రతిసౌఖ్యంబులతును దప్పై రీతిన్
ద్వ్రతంబేగెద మందర
గిరిపైకియిపుడు పశుపతి గీర్తించుటకై

క॥ ఈవిధి ప్రియునిం దూఱుచుఁ
బోవుట కాయత్తమైన పొలతిగ్గని సం
ధ్యావళి దఱికరిగి పలికె
భావంబున నలముకొన్న భయవినయములన్

చ॥ సరసిజగర్భు నాత్మజవు సర్వమెఱింగియు భక్తితో మనో
హరుఁ దొనరించు దివ్యమగు నచ్యుతుపూజల మాన్పబూనుదే?
యెఱుఁగని మూఢురాలివలె నిట్లనిరించుట నీకు బాడియే?
పరసతతో జరింపదగు సాధ్వులు భర్తమనంబు చొప్పునన్

క॥ సతులకు విభుఁడే దైవము
శ్రుతియాతని మాట తలపసుదతుల కిలలో,
వ్రతములు ప్రభుకార్యంబులు
పతి పరివారంబుసుతులు బంధువులరయన్.

క॥ పతిభక్తిని మించిన స
త్కృతి వేరేదియును లేదు స్త్రీలకు నెందున్
సుత యుతుఁడగునజు మానస
సుతవగుట, నెఱుఁగుదు ధర్మ సూక్ష్మములెల్లన్.

సీ॥ నిత్యకృత్యంబులు నియతితో నొనరించి
ప్రాణేశు ననిశంబుభక్తిఁ గొలిచి
యిష్టమృష్టాన్నములింపుతో గాభించి
ప్రియునకు గడుపార బ్రీతి నొసగి
భుక్త శేషంబును ముదముతో గైకొని
తగిన విధంబునే దాభుజించి
మించు వేడుకతోడ మృదుతల్పమునమర్చి
విభుడురాగైకొని వినయమొప్ప

తే॥ గీ॥ సంతసించుచు నెదురేగి సత్కరించి
పొందికను గొనివచ్చి తాంబూల మొసఁగి
చరణ కమలములొత్తుచు వరుని నిదుర
బుచ్చి నిదురింపవలయును బొలతిభువిని.

సీ॥ మగని బ్రతిఘటించి మాటాడుచుండుట
పొరుగు వారింద్లకు నరుగుచుంట
విభునాజ్ఞ పొందక వెచ్చంబుసేయుట
తలవాకిలికి ముందు నిలిచియుంట
ప్రాణేశు నగలకై బాధించు చుండుట
కాంతు నిష్టములేక కలియుచుంట
పతికంటె ముందుగాఁ బ్రక్కపై చేరుట
యున్నతాసనమున నుండుకొనుట

తే॥ గీ॥ భర్తకంటెను ముందుగఁ బండుకొంట
ప్రియుడు లేచినపిదప నిద్రించు చుంట
చెలువుడు భుజింపకుండ భుజించు చుంట
మఱచియైన చేయగరాదు మానినులకు

క॥ పతిభక్తి కల్పభూజము
పతిసేవయె యిష్టసిద్ధి పరికింపంగా
పతిపూజయె శుభజనకము
పతికొలువె కొంగు పసిఁడి భామామణికిన్.

సీ॥ పరదేశమందునఁ బ్రాణేశుఁడుండగ
గైసేత కూడదు కాంతలకును,
పరకాంతలను బ్రీతివరుఁడు వరించిన
కోపమందగరాదు కోమలులకు,
పరపురుషులతోడఁ బరిహాసమాడుట
పాడికాదు తలప భామినులకు
కూర్మితో విభుడేది కోరినప్పటికిని
విసుగు పనికిరాదు వెలదులకును

తే॥ గీ॥ మగని నిందించుట తగదు మానినులకు,
భర్తగానని విందు తగదు భామినులకు,
రతులదప్పు చనుపు తగదతివలకును,
పురుషు నలిగించుట తగదు పొలతులకును.

తే॥ గీ॥ భర్తతో సహగమనంబు భక్తితోడ
నాచరించినయట్టి పుణ్యాంగనలకు
వల్లభునితోడ లభియించు స్వర్గసుఖము
వారి సేవింతురప్సర వనితలచ్చట

తే॥గీ॥ భర్తృహీనయైన వడతి వ్రతములెన్ని
ప్రీతిజేసి తీర్థములదర్శించి స్నాన
మాడి తత్ఫలితమ్ము ముత్తైదువగతి
బొందదు పతియుండుట పూర్వపుణ్యఫలము

క॥ పెనిమిటి మరణించిన యం
గనలను ముత్తైదువట్లు కార్యములందున్
ఘనముగ పూజింపరు విధ
వను గాంచుట దోషమంచు బలుకుట వినమే.

సీ॥ కార్యంబులన్నియు గావించు పట్టున
దాశీ విధంబన దనరవలయు,
నుత్తమమైనట్టి యోచనల్చెప్పుచు
మంత్రి పుంగవునట్లు మసలవలయు,
బ్రీతితో నన్నంబు బెట్టి దినమయాన
కన్నతల్లి వలెను గడపవలయు
శయన మందిరమందు శయనించువేలను
తలవంగరంభయై మెలగవలయు

తే॥గీ॥ వద్మవిధమున రూపాన బరగవలయు
నుర్విమాద్కి నోర్పుగలిగి యుండవలయు
నెల్ల వాంఛలఁ దీర్చుచు నింపుతోడ
ధవునిమనమును గ్రహియించి ధర్మపత్ని

క॥ మంగళ సూత్రంబులు భువి
శృంగార జనకములరయ స్త్రీకన్నింటన్
బంగారము సొగసగునే
మాంగళ్యములేక యెట్టిమగువుకునైనన్

క॥ పతిమాట గౌరవింపని
సతిబాధలనొందు యముని సదనము నందున్
హితమభిలషించి తెలిపెద
నితిహాసము నిప్పుడొకటి యింతి వినుమీ

క॥ పనివాడొక్కడు కట్టెలు
జనకుని గృహమున వతికెడు సమయమునందున్
కనుగొంటి నొక్క కీటక
మునుగట్టెల నడుమనుండి భువిపై పడుటన్

వ॥ భూమిమీద పడి పొర్లాడుచున్న ఆ కీటకమును కాకులు బాధించుట చూచి వానిని చెదరగొట్టి నీడలోనుంచి చల్లనినీటిని తెచ్చి దానిపై జల్లి సేదతీర్చితిని అపుడాపురుగు నన్నుజూచి మనుజ భాషలో నిట్లు పలికెను,

సీ॥ మాణిక్యపురమునా మహిని పేరొందిన
యుగ్రహారమువందు నలరుచుండె
వేదాది విద్యల విఖ్యాతి గాంచిన
విష్ణుశర్మయనెడి విప్రుడొకడు
వాని కుమారుడు పద్మనాభుడు నన్ను
పరిణయమాడిన భర్తయయ్యె
సంధ్యాదనుష్ఠాన సకల విద్యలకును
శైశవమందున స్వస్తిచెప్పి

తే॥గీ॥ కపట నటనలయందున గణనకెక్కి
కామ శాస్త్రంబులన్నియుఁ గడిమినేర్చి
యన్యకాంతాభిలాషతో నతిశయించి
వినుతి నొందెను జూదాది విద్యలందు,

క॥ మనసిచ్చి యొక్క సాధువు
నను గదియదు పావమనక నయహీనుండై
యనిశము పరకాంతలతో
తనకాలము గడుపుచుండు దౌర్భాగ్యుండై

సీ॥ నిలయంబు చక్కగ నలికి ముగ్గులు పెట్టి
చెలువుడింటికివచ్చి చేరగానె
యలసివచ్చెననుచు నాత్మతో భావించి
సేవల నొనరించి సేదతీర్చి
శ్రద్ధతో వండిన శాకపాకంబుల
నను నయంబున పెట్టి యాదరించి
భుక్తశేషంబును భక్తితో భుజియించి
సత్వరంబుగ పనుల్చక్క పెట్టి

తే॥ గీ॥ శయన మందిరంబున మృదుశయ్య యందు
రంభయోయనగను పరిరంభమునకు
గడిగియున్న నన్ గన్నెత్తి కాంచకుండ
విరహ బాధల గురిజేసి వెడలిపోవు

సీ॥ అగ్నిసాక్షిగ గొన్న యతివను నను వీడి
భోగ కాంతములతోడ బొద్దుపుచ్చి
యింగితంబును వీడియింటను నిలువక
జారచోరుల తోడ సంచరించి
యవమాన మనుమాట నాత్మధనంబవక
కూళలతో జెల్మి ఖ్యాతి చేసి
త్రాగుబోతులతోడ తందనాలాడుచు
దుర్వ్యసనములకు దోసిలొగ్గి

తే॥గీ॥ తాతముత్తాత లొసగిన ద్రవ్యమంత
చిల్లిగవ్వల మాడ్కిని చెల్లగొట్టి
మన్మథోన్మాద పూరిత మానసమున
జ్ఞానమిసుమంత లేక యజ్ఞానియగుచు.

క॥ కనకాది భూషణంబుల
కనులకు నింపైన వస్తుగణములతోడన్
దిన దిన మమ్ము దొడంగెను
దనమనమున జారగొన్న తరుణులబొందన్

క॥ అలవోకగ సొమ్మంతయు
విలువెఱుగక ఖర్చుచేసి వెలయాండ్రకునై
వలదన్నను వినకుండను
వలువురకడ నప్పుజేసి వ్యయమొనరించెన్.

క॥ తనకిక నెవ్వరు డబ్బి
యని సమయము వచ్చువఱకు నప్పులుచేసెన్
మునువప్పిచ్చిన మానవు
లనయము వేధింప సొగిరప్పును దీర్పన్

క॥ పరపతి నశించి విప్రుడు
చరియించుటఁగన్న యట్టి సార్థసనేత్రిల్
దరి చేరనీయకుండిరి
మ్మెఱువక సొమ్ము గొఱరమ్ము మాపటికనుచున్.

వ॥ ఆ సమ్మయంబున,

తే॥గీ॥ బాధలన్నియు బడలేక పద్మనయన
యింటిదగ్గర మీసొమ్ము నిత్తుననుచు
వారి జేకొనివచ్చి నావెల్లభుండు
తమణి వినుమని పలికెను తల్లడిలుచు

సీ|| అప్పును దీర్చు మంచల్లరిచేయుచు
వడివీధి యందున నన్నుగొట్టి
యిచ్చవచ్చిన రీతి నిక్కట్లు పెట్టుచు
గట్టు వస్త్రంబులఁ బట్టిలాగి
ధనమిచ్చి కదలరా దౌర్భాగ్యుడా యని
గుంజకు బంధించి కుళ్ళబొడిచి
వీరలందఱు నన్ను వేధింప నోర్వక
దిక్కొదు నీవని తెచ్చియుంటి

గీ|| గుణవతివి నీవు నగలమ్మి ఋణము దీర్చి
తప్పులన్నియు క్షమియించి తక్షణంబ
నన్ను కరుణతో కాపాడు మన్నమిన్న
యిల్లువీడక ప్రీతి నిన్నేలుకొందు

క|| నీ నగలకు రెట్టింపును
మానక చేయించియిత్తు మగువా నీకున్
నేనిను బెట్టిన బాధలు
మానసమందున దలఁపక మనుపుము నన్నున్

ఉ|| చేరను వారకామినుల జెంతకు జూదములాడ నెన్నడున్
కూరిమితోడ గూడనిక కూళల, నప్పుల జేయ నేటితో
దారుణకృత్యము ల్విడిచి తప్పక గేహమునందె యుండెదన్
సారసగంధి సత్యమిది సత్కృప జూడుమటంచు వల్కుచున్

క|| చరణంబులపై శిరమిడి
వరివరి విధముల వగచెడి పతిమస్తకమున్
గరువమున ద్రోసిపైచితి
[illegible] గొంకింతయునులేక కర్కశమతి నై.

సీ|| పుస్తి కట్టిన దాది పొత్తుగా యొకనాఁడు
కన్నెత్తి నాపైపు గాంచవైతి,
తోబుట్టు లెవ్వరు తోడు లేరంచును
సత్కృప నొకనాడు సాకవైతి,
ఋతుకాలము నెఱింగి హితముతో దరిజేర్చి
పత్నితో తనయుల బడయవైతి,
సకల కష్టంబులు సహియించి నేనుండ
కట్టు వస్త్రములైన పెట్టవైతి,

తే|గీ|| ఏ నగ ల్మా పితరులిచ్చి రీయ ననుచు
వివిధ రీతులఁ బ్రార్థించు విభుని వదలి
జాగు సేయక యిటనుండి జాలిపీడి
పుట్టినింటికి తిన్నగ పోయియుంటి

తే|గీ| అప్పు లిచ్చిన మానవు లతని బట్టి
కట్టి కొట్టి తిట్టుచుకడు కష్టపెట్ట,
నప్పు తీర్పు మార్గం బిక నరయలేక
యదను గమగొని యా తిని మర్ధరాత్రి

సీ| కట్లు మెల్లగ త్రెంచి కనపడ కుండగ
నగరంబు వెలువడి నా విభుండు
పయనంబు గావించి పల్లెలు పట్నముల్
వనములు నగములు వరుసదాటి
వనధి తీరముఁ జేరి వణిజ పుంగవులతో
నొడ్డు వీడుచునున్న యోడగాంచి
యనుమతిని వడసి యందు నధివసించి
సాగరమందున సాగుచుండ.

తే॥ గీ॥ పెక్కుదీవులు గడిచిరో నొక్కనాడు
పెద్దగాలులు చెలరేగ భీతిఁ జెంది
యబ్ధినడుమను నొక్కమహాద్రి దరిని
గలము నిలిపిరి నావికుల్ కదలకుండ

వ॥ ఓడ నిలిపినకొలంది కాలమునకు చంద్రోదయమయ్యెను.

క॥ నెలపొడ చూపిన యంతనె
తెలుపెక్కెను నింగినేలదేస లెల్లడలన్
వలపెక్కె విరహజీవుల
గలగుండు నృదియెఁ జోరగణములకెల్లన్

క॥ నావికుఁడొకఁడు తోడను
జావగల నే యిటనంచు శైలమునెక్కెన్
ధావించుచు దాఁ దినుటకు
నేపైన ఫలములు దొరుకునేమో యనుచున్

సీ॥ గిరిమీద నొకచోట సరసును గనుగొని
స్నానంబు గావించి సత్వరముగ
తత్సమీపములోని తరువుల ఫలములు
తృప్తిగ భుజియించి తీరమందు
బిల్లతెమ్మెరలకుఁ జల్లగ నిదురించె
నలసిన కతమున నవని సురుఁడు
దైత్యకాంత యొకతె దరిఁ జేరి మేల్కొల్పె
తెలివొంది దిక్కులు కలియఁ జూచి

తే॥ గీ॥ మరుని పూబంతి వలెనున్న ముగ్ధకాంతి
స్వాంత మందున మిగులనాశ్చర్యపడుచు
నెవరి దానవు కామినీ యిచటికిపు
డాగతంబేమని యడుగ రమణి పలికె.

ఉ॥ తారక నామధేయుఁడను దానవుఁడీగ్గిరిపై వసించి సం
చారమొనర్చి జీవులను జంపుచు జాలిసుమంత లేక సం
సారులఁ బట్టితెచ్చి యపచారమొనర్చుఁ గ్రూరచిత్తుడై
యేరిని జీరికిన్గొనక యెంతయు గ్రొవ్వి చరించుచుండెడిన్.

క॥ ధరణీసురనే నతని పి
యురాలను సుకేశిపేర నుర్వీస్థలితో
దిరుగుచు నచ్చిన రూపును
ధరించి క్రీడించుచుండు దైత్యుని తోడన్

క॥ మానవ భోజనుఁడనిశము
మానక చేయుటఁ జెపుడు నమానుషచర్యల్
కానగ లేక మది గనలి
నేనిటు నటు తిరుగుచునిట నినుఁ గనుగొంటిన్

వ॥ ఆ తారకుడు కాశీపురాధీశుఁడైన పాంచాల శేఖరుని కుమార్తె పద్మి
నియను కన్యకామణిని తన సౌధమునందు పాన్పుపై సుఖనిద్ర
చెందుచుండగా బాలికను శయ్యతోగూడ గైకొని వచ్చెను ఆమె
అంగసౌష్ఠమున కచ్చెరు వందుచు నిను వరింపుమాదెద నని
చెప్పుచుండ విని అతడిక నన్నొల్లదని గ్రహించితిని. అది యుం
గాక

చ॥ దనుజుని సంహరించిన ముదంబును పొందుచు నీకు భార్యనై
యనయము సేవ చేయుచు నయంబున నీ మదికింపొనర్చు రూపు
ను ధరియించి కోర్కెలను బోడిమి దీర్చుచునుందు నమ్ము నీ కను
పమ భోగ భాగ్యముల నబ్బజేయు తెఱంగొనర్చుచున్

క॥ ధనువును శరములు గైకొని
దనుజునితోఁ బోరుమంచుతన్నా దైత్యారి
గన పలుకితుల వేదగ
విని రాక్షస కాంతతోడ విప్రుండనియెన్

తే॥గీ॥ నాతి నీమాట మనమున నమ్ముటెట్లు
నారుల మనమునెఱుగంగ నరుని వశమె?
విభుఁడు, ననుజూడు, సుతదను ప్రేమ వీడి
నసువులను గొన్న కాంతల నవని గనమె

క॥ చతరమతులు వీత భయులు
ప్రతిభాషుతులన్య పురుషరత్యా సక్తుల్
ధృతియుతులు కఠిన చిత్తులు
హితా హితంబులు తలంపరింతులు ధాత్రిన్

క॥ అనవుడు దైత్యాంగనయును
వినుమో ధరణీసు వర్వవిధి యుక్తముగా
నను బరణియ మాడిన విభు
దని తలఁవకి తండతి కలుషాత్మకుడు సుమీ.

క॥ అవ్రతంబే నాడిన గో
వును, విప్రుని దునమిన క్రతువును నిలిపినపు
త్రుని నఱకిన గలుగు దురిత
మును తవ్వక ననుభవింతు భూదివిజేంద్రా!

క॥ అని పలుకుచు నా సుందరి
ధనస్నునంబుల వొదియును దనకిచ్చిన గై
కొనియూ విప్రుడు త్రుటిలో
దనుజు నిబరిమార్చ జూడు తరుణీయనుచున్

పంచ చామరము
శరాననంబు నెక్కుబెట్టి జంకకించు శేసియున్
బిరాన తద్గుణ స్వనకబు బిట్టొనర్చి నంతనే
యురబ్యమెల్ల దద్దరిల్ల నాలకించి తారకా
సురుండు ధూర్తుకక్కడింట జొచ్చెనఁచు క్రోధియై

సీ|| సకలాయుధంబు చయ్యన గైకొని
పద్మిని కన్యను పాన్పునుండి
కదలకుండ నటుల కట్టడి గావించి
కొంత దవ్వేగి యా కొండ పైని
రమణి సుకేశిని ప్రక్క ధనువు దాల్చి
ధీరతన్ నిలచిన ద్విజుని జూచి
నదురు బెదురు లేక నా ప్రియసఖితోడ
జేతులు కలుపుదీ చెనటి యనుచు

తే|గీ|| బాణ వర్షము గురిపింప పాలు దేమి
లక్ష్య పెట్టక యన్నిటి లాఘవమున
దునుకలుగ జేసి రక్కసు తనువు నెల్ల
దూటు లొనరించె వాడియౌ తూపు లేసి

క| దనుజుం డాతని శక్తికి
దనమది నాశ్చర్య పడుచు దడయక వింటన్
ఘన నారసముల బొదవి
దన బలిమిన్ లాగి విడిచె ధరణీ సురుపై

క|| మనుజుం డా సాయకముల
ఘన నారాచములతోడ ఖండించి వడిన్
దనుజుని ధనువును దునిమెను
దన మనమందున సుకేశి తద్దయు మెచ్చన్

క|| చాపము విఱుగగ నసురుఁడు
కోపముతో శూల మేయ క్షోణీసురుఁ డా
టోపమున వింట నొక వధి
తూపులు సంధించి విడిచి తునుకలు చేసెన్

క॥ దనుజుం డపు డాగ్రహమున
తన ఘన గదతోడ విప్రుఁ దలపై వేయన్
మనుజుఁడు తప్పించు కొనుచు
సునిశిత శస్త్రమున దాని చూర్ణము చేసెన్

క॥ రక్కసు డట్లగుటం గని
యొక్కట ఖడ్గంబు విసర నుద్వేగ్రముతో
బ్రిక్కకును దొలగి భూసురు
డొక్క శరముతోడ దైత్యు నుర్విన్ గూల్చెన్

క॥ ధర నసురుఁడు వడి నంతనె
తరళేక్షణ యా సుకేశి ధాత్రీసురునిన్
సరగున నక్కున జేరిచి
సురతంబును సలుపుచుండ సుఖముగ పొదలన్

క॥ కలకన్ బాతెను జుక్కలు,
నెలబాలుఁడు కాంతి దఱిగి నింగిని దోచెన్,
గలువలు ముకుళిత మయ్యెను
జలజాప్తుఁడు దోచె దూర్పు శైలము నందున్

సీ॥ అర్కకాంతులగాంచి యానంద మందుచు
వటము చెంగటనున్న వారి కడకు
పద్మినీ కన్యక వచ్చిన వీక్షించి
యాదరించి సుకేశి యనియె నిట్లు
రమణిరో రణమున రాక్షసుఁ బరిమార్చి
రక్షించె మనలను బ్రాహ్మణుండు
నీ తల్లి దండ్రుల నిన్ను జేర్చెద నింక
భీతిని విడనాడు వెలది యనుచు

తే॥గీ॥ హంసియై తన వల్లభు నాయబలను
మూపున వహించి యత్యంత ముదము తోడ
నంబరంబున బయనించి యబ్ధి దాటి
వారణాసి జేరి యచట వానిదించి

తే॥గీ॥ కామరూపధారణ శక్తి గల సుకేసి
మరుని రాచిల్కయో యన మరులు గొల్ప
భువన మోహనాకారియై పుడమి నిలిచి
పద్మనాభు నుద్దేశించి పలికె నిట్లు

క॥ కనుగొను మిదె కాశీపురి
ఘనతాప విదారి దివ్య గంగాలహరిన్
మునుగుము ఢుంఢివినాయకు
వినుతింపుము కల్గునెల్ల విభవమ్ము లిలన్

క॥ మనమందు గాలభైరవు
మననము గావించు నెట్టి మానవు సైనన్
గనికరమున గాచు నతఁడు
వినుతింపుము మేలు కలుగు విప్రశ్రేష్ఠా।

ఉ॥ దారుణ పాపదారకము తాపవిదారక ముగ్రరోగ సం
హారక ముత్తమోత్తమ సుఖాకర మార్తి పరీత ఘోర సం
సార పయోధి తారకము జన్మ వినాశన హేతుభూత మి
ద్ధారుణి కాశికావిభుని దర్శన భాగ్యము భూసురోత్తమా।

సీ॥ క్షేత్రంబులందున క్షితియందు ప్రథమంబు
కాశికానగరంబు గణనసేయ
దిలకింప జగతిని తీర్థంబులందున
గంగాలహరిసాటి కానరాదు

విశ్వంబు నందున పేల్పు పెద్దలయందు
విశ్వేశ్వరుని వంటి వేల్పులేదు
పృథ్విపై నెల్లడ వీక్షింప నేందున
శైలజ కెనయగు శక్తి గనము

తే॥ గీ॥ ప్రత్యహంబును నిప్పురి ప్రతిభ మెఱయ
నర్థులకు నన్నమిడు నంట యన్నపూర్ణ
యాది భిక్షువు శంకరు డహరహంబు
నాదరముజూపి ప్రజలం గాపాడుచుండ

ఉ॥ భూతలమందు గోవులను - భూదివిజాళిని, దల్లిదండ్రులన్
దాతల, భామలన్, బుధుల, ధర్మపరాయణ, జీవకోటులన్
నీతిని వీడి హింసలకు నిత్యము పాల్పడరించునట్టి యా
పాతకు లిందువచ్చునెడ బాపము బాసి సుఖింతు రెప్పుడున్.

ఉ॥ పొందున గొప్ప పుణ్యములు భూతలమందొనరించి యుండియున్
బొంద నశక్యమైన దగు మోక్షపదంబును గాశికాపురిన్
మ్రింగిన కారణంబున నె మాన్యుల మాట్కని ప్రాణు లెల్లరున్
బొందుట జూడగన్ మదికి భూదివిజోత్తమ చోద్యమయ్యెడున్.

క॥ గంగానదిలో స్నానము
గంగాధరు దర్శనంబు గౌరీసేవల్
రంగుగ గాశీపురమున
మంగళ కరసూచనమ్ము మనలకటంచున్.

ఉ॥ భూసురుంగూడి భూవిభుని పుత్రిక పద్మినితో సుకేశియున్
భాసిలు దివ్యజాహ్నవిని బాగుగ స్నానము నాచరించి దే
వాసుర పూజ్యపాదుం గరుణాకరు సూర్య శశాంక నేత్రుంగై
లాస నగాధి నాథు గని లక్ష్యము నిల్పస్తుతించి రివ్విధిన్.

సీ॥ శ్రీ జాహ్నవీ జలసిక్త జటాజూట।
జూటవిస్ఫూర్జితచోక్షచంద్ర।
చంద్రిమాన సమాన సౌంద్య సితదేహ;
దేహ విలేపిత దివ్యభస్మ।
భస్మరాగాంచిత వ్యాఘ్రి చర్మాంబర।
అంబర చుంబిత యద్రివాస।
వాసవ పూజిత వరపద రాజీవ।
జీవ జీవాధార జీవహరణ।

తే॥గీ॥ రణజిత పరాక్రమోపేత రాక్షసగణ।
గణన సేయ నగణితమౌ గుణసాంద్రాఢ్య।
కాశికావాస పరమేశ। కలుష హరణ।
విశ్వ రంజక విశ్వేశ। విమల చరిత।

సీ॥ గంగా శిరోధార। గౌరిమనోహర।
కైలాస కేతన। కలుష హరణ।
కాలకూటాహార। కారుణ్య సాగర।
శ్రితజన మందార। శేషహార।
నాగాజినాంబర। నటన మనోహర।
సర్వ లోకాధార। శైలధీర।
భక్త వశంకర। పాప భయంకర।
నిరుపమ గుణసార। నిర్వికార।

తే॥గీ॥ విమత భీకర। శుభకర। వేదసార।
క్లేశహరణ। కాలకరథర। కీర్తి విసర।
మదన సంహార। శంకర। మంగళకర:
కాశికానాధ విశ్వేశ। కావుమయ్య

మ॥ గిరిజాధీశుని పాదపద్మముల భక్తిన్ సంస్తుతుల్సేసి త
త్పుర మందున్న ప్రధాన దేవతల సంతోషంబుతో గొల్చి భూ
సురు దుర్గీశుని మందిరంబునకు రాజన్ జూడగా నేగె నా
సరసీజాక్షులతోడ సొంపెసఁగు నుత్సాహంబు దీపింపగా.

సీ॥ పాంచాల శేఖర ప్రభువరుఁ డెన్నటను
పద్మనాభ సుకేశి పద్మినులను
వీక్షించి నంతనే వేదనను మఱచి
పెన్నిధిం గాంచిన పేదవోలె
సంభ్రమాశ్చర్యముల్ స్వాంత మందుదయింప
పుత్రి నక్కున జేర్చి పొలుపు మీఱ
నంతఃపురంబునఁ జెంతిల్లు సతులకు
ముద్దు బిడ్డను జూసి ముదము గూర్చె

తే॥ గీ॥ నగరు వీథి నప్పటి నుండి నాటి దనుక
కన్య జెప్పగ జరిగిన గాథ నెఱిఁగి
పద్మనాభు సుకేశినిన్ పార్థివుండు
సవినయంబుగ గొనివచ్చి సంతసమున

తే॥ గీ॥ స్వర్ణ పీఠము నందుంచి సంస్తుతించి
విలువగల భూషణంబులు వేడ్క నొసఁగి
కనక చేలంబులను బ్రీతిఁ గట్ట బెట్టి
పద్మనాభునితో ననెఁ బ్రభువరుండు.

ఉ॥ నేనును నాసహోదరియు నీరజనేత్రి గుమారి గానకన్
మానస మందు నిత్యమును బ్రుగ్గుచు నేమియు తోచకుండ శో
కానల మందు బాధపడు టారసి మమ్ముల బ్రోచు బంధుడున్
దీన జనావనుండు నగు దివ్యుని సత్కృప గంటి మిచ్చటన్.

క॥ మా పాపను రక్షించిన
మాపాలిటి దేవులీరు మది తలపంగా
నేపాటి వార మయ్యా
మీ పాటవ మెఱింగి పొగడ మేదిని మిమ్మున్.

సీ॥ అవహ మొనరించి యసురుని బరిమార్చి
మా పుత్రికను బ్రోచి మా కొసంగి
మమ్ము రక్షించిన మహనీయులౌ మీకు
ప్రత్యుపకృతి సేయ బాధ్యగాదె
యిటువంటి మేలున కీడగు కార్యంబు
వశమౌనె చేయ నెవ్వారి కైన
ఆహుళ సామ్రాజ్యంబు బాలికతో నిత్తు
నన్న గాదనక ప్రసన్న బుద్ధి

తే॥ గీ॥ నందఱను పేర్మి పాలింపు మనుచుఁ బలికి
బంధు వర్గము రావించి వైభవముగ
పద్మినీ పద్మనాభుల పరిణయమును
జేసె నప్పుడు పాంచాల శేఖరుండు

క॥ పెక్కగు భూషణములను
మక్కువతో భూసురునకు మహిపతి యొసగెన్,
జక్కగ నన్నిటి గైకొని
యొక్క దినమున బయలు[illegible]ంచి యువిదల తోడన్.

క॥ నేనున్న గృహంబునకును
వా నాథుం డేగుదెంచి నాగత కృత్యముల్,
మానస మందున దలపక
కానుక అర్పించి నన్ను కారుణ్యము [illegible]న్.

కII తనరాజ్యమునకు కృపతో
నను ప్రాణేశుఁడు తన నారుల తోడన్
గొనిపోయి సకల సుఖములు
ఘనముగఁ జేకూర్చుచుండ కాలము గడుషన్.

తేIIగీII నా విభుండేగె మరణించి నాకమునకు
పిదప మృతినొంది కాలుని సదన మందు
బతిని బెట్టిన బాధల ఫలిత మొంది
కాష్టమున బుట్టితిని కీటకమ్ము నగుచు.

తేIIగీII పడతి నీ స్పర్శచే పూర్వ భవము తెలిసె
మహిని పుణ్యమార్జింవగ మాఘ మందు
స్నాన మాడిన యొకనాటి సత్ఫలంబు
దాన మిచ్చిని కలుగు సద్గతులు నాకు

కII అని దీనత నది వేడిన
కనికరమున నే నొసంగ క్షణకాలములో
వెనుకటి రూప మెడలి యం
గనయై చనె నాకము దెస ఘన తేజముతో.

చII కనుక మగండె యేడుగడ కాంతల కెందును ప్రాణనాథు గా
దని యెదురాడ కెంతయును నర్హముగాదు తలంచి చూడగా
వనజదళాక్షి డెందమున వంతమువీడి వసుంధరాధిపుం
డొనరుచు శ్రీహరి వ్రతము నొప్పరికించుచుండు బేతగున్,

వII అని సంధ్యావళీదేవి మోహిని దేవిని కాష్ఠకీటకీయోపాఖ్యానమును వినిపించెను.

౬॥ అనవిని మోహిని మదిలో
జనియించిన క్రోధమునను సంధ్యావళితో
ననెఁ బతికడ నీవిధముగ
నిను నెవరు పిలిచిరి నాకు నీతులు సెప్పన్.

౭॥ పిలువని పేరంటముచే
వొలగును గౌరవ మటంచుఁ దోయజ వదనా!
తెలియదె? మా భార్యాభ
ర్తల తగవుల తలనుదూర్చఁ దగునే నీకున్.

౮॥ [illegible]నపతి తోడ నే నిలిచి చర్చను సల్పెద[illegible] కాల[illegible]మందునన్
ఏను[illegible]నె? నీదు మాటలు విపరీతములేక మహా[illegible]తో
[illegible]నముగ నీదు గాథలను గొంప మె[illegible]గ వ[illegible] తె[illegible]యున్
జను మికనైన శీ[illegible]ముగ జాలము సేయగ[illegible] మా[illegible].

[illegible]॥ ఏమాట దాట నంచును
సోమపతీశ్వరు నదురగ నాడిన మాటల్
[illegible]మీఱ డెట్లు కాదను
భామా నీతోడి మాకు పనియే మనుచున్.

[illegible]॥ [illegible]విధ[illegible]గ మోహిని సం
ధ్యావళినిం [illegible] బలికి ధవుతో ననియెన్
[illegible]ర [illegible]దేటి న్యాయము
[illegible] వనితలు తగవులాడ నీవిటు చూడన్.

[illegible]॥ సత్యంబు విడనాడి చరియించు మానవుల్
పాపకూపంబుల బడుదు రంద్రు
నిజము[illegible]ను బోనాడి నెగడెడి మానవుల్
కీర్తి నశించి దుఃఖింతు రండ్రు

బొంకంగ నిసుమంత జంకని మానవుల్
శ్రీని గోల్పోయి చరియింతు రంద్రు
యనృతంబు వెఱువక యాడెడి మానవుల్
పూర్ణాయు విలలోనఁ బొందరండ్రు

తే॥గీ॥ సకల మెఱిఁగియు నీ విటు శర్యుముందు
నా యనుజ్ఞ దాట నటంచు నమ్మ బలికి
వ్రతము కలదంచు నే డొక వంక జెప్పి
యాడి తప్పుట తగునయ్య యవనిపాల।

సీ॥ సకల తీర్థంబుల స్నానంబు లాడుట
పుణ్య భూములవెంట బోవుచుంట
హయమేధ యాగంబు లతిభక్తి సలుపుట
నిఖిల వేదంబులు నేర్చు కొనుట
కల్పతరువు వోలె కామితంబు లిడుట
నిరతాన్న దాతయై నెగడు చుంట
గుడులు గోపురములు కొమరొప్ప గట్టించి
శిల్పములను బ్రతిష్టించుచుంట

ఆ॥వె॥ మంచినీళ్ళ కొఱకు మార్గ మధ్యంబున
బావుల నెలకొల్పి ప్రబలు చుంట
సత్యవాక్కుతోడ సరిగా వటంచును
చెప్పవలెనె నీకు క్షితితలేంద్ర,

క॥ కులకాంతకు మానమువలె
వెలయాలికి నుచితమైన వేషము రీతిన్
గలిమికి వితరణ మట్లును
పలుకునకున్ సత్యముగద ప్రాణం బధిపా,

సీ॥ ఆడి తప్పగలేక నష్ట కష్టము లోర్చె
జగతి హరిశ్చంద్ర చక్రవర్తి
యాడి తప్పగలేక నడవుల పాలైరి
బలయుతు లయ్యును పాండు పుత్రు
లాడి తప్పగలేక నడవుల కంపెను
తన ముద్దు బిడ్డను దశరథుండు
ఆడి తప్పగలే హరికిచ్చి దానంబు
నమర లోకము వీడె నసుర వరుడు

తే॥ గీ॥ నాడి తప్పక కష్టము లనుభవించి
యశము గాంచిన వారల ఖ్యాతి నెఱఁగి
పార్వతీశ్వరు సన్నిధి బల్కి నట్టి
పలుకు దప్ప జూచెద వేల పార్థివేంద్ర।

క॥ కంతుని శరములచే మే
నంతయు నెఱియుంచుచుండు నగునే యోర్వన్
సుంతయు లేదా యోచన
పంతము లాడెద వదేల వ్రతము లటంచున్.

క॥ పొంగెడు జవ్వన మందే
యంగజు కేళి ననుదేల్చ నవనీ నాథా।
యంగపు సోయగ మెదలిన
నంగన సెవ రనుభవింతు రాదర మొప్పన్.

తే॥ గీ॥ నీదు సుతునకు రాజ్యంబు నేడె యిచ్చి
మదన కేళిని తేల్పుమా మమత నన్ను
నట్లు కాదేని సత్వర మానతిమ్ము
మందరాద్రి కేగి శివుని మదిని గొలుతు.

క॥ అని వివిధ విధంబుల బ
ప్పని యాడెడు ముల్కు లట్టి వాక్కులు వినియున్
మనమున ధైర్యము వీడక
మనుజాధీశుండు పలికె మానినితోడన్,

క॥ వ్రతదీక్షల యందైనను
పితృదేవతపూజలందు వైదక్రియలన్
మృతసూతకముల శ్రీహరి
వ్రతమెవ్వరు వీడజనదు వనితా వినుమీ

ఆ॥ హరిదినవ్రతమిల సఖిల జనాళికి
వీడరానిదగుట విశదముగను
నింతవఱకు నీకు నెరిగించితిని నాకు
సహకరింతువనుచు చలము వీడి

క॥ పొంకెద ననిమదిఁ దలపకు
సంకటములు వచ్చిపడిన సత్యము వీడన్
పంక విడుచు సన్యాయము
గొంకక యొనరి చుట్టి క్రూరుద నాకో

చ॥ పటుతు సమస్త భోగములు వేగమె కామలనుజ్జగించెదన్
గడువడి రాజ్యమంతయును గాదనకుండను నిచ్చువాడన్
నడిగిన పుత్త్రి మస్తకము నైనను జంకక కోసి యిచ్చెదన్
విడుమి హరివ్రతంబుడుగ మోహిని యెవ్వరు వచ్చి చెప్పినన్.

పంచచామరము.

కృపాలు నిశ్చయంబు భిన్న నీరజాక్షి గొంకకే
సుపుత్త్రి మస్తకంబు ద్రుంచు క్షోణినాథ శీఘ్రమే
కృపాకటాక్షమంతవీడి కేశమోర్చు తండ్రిక
న్న పావ నిట్లు చంపనుండ నాకు నేల కాదనన్,

తే॥గీ॥ వ్రతము మాన నంటివి గాన వాదమేల
సూను ఖండించి నిలుపుము సూనృతంబు
రెండిలో నేదొ యొక టొనరింపు మిపుడు
జాగుమాని రుక్మాంగద క్ష్మాతలేంద్ర।

క॥ ములుకుల బోలిన మోహిని
పలుకులకును డెందమందు పరితాపముతో
విలపించుచు సంధ్యావళి
జలజానన దరిని జేరి చయ్యన వలికెన్.

సీ॥ పార్థివుండును మేము పరితపించుచునుండ
కర్కశ హృదయవై కరుణ వీడి
వంశాంకురంబైన బాలుని వధియించి
యిమ్మని యడుగ నోరెట్లు వచ్చె?
మగనికి నీపైన మన్నన గలదని
కొరగాని కోర్కెలు కోరదగునె?
వసుమతీసుని చేత వ్రతమును మాన్పింప
తరళాయతాక్షి నీతరముగాదు

ఆ॥వె॥ పద్మబాంధవుండు పడమట పొడిచిన
మిన్ను విఱిగి భూమిమీద పడిన
సప్తసాగరములు సంకీర్ణమైనను
వ్రతము విడ కుండు పార్థివుండు,

సీ॥ అనుచు సంధ్యావళి మనుజేంద్రు వీక్షించి
యఖిలంబు నెఱిగిన యార్య మీకు
బామరుని వలెను పగవంగ నేటికి
హరియో హరుండొ లేక నబ్జభవుడొ

నిను పరీక్షింప నీ నెలతను సృష్టించి
పంపి యుందు రనుట వాస్తవంబు
కాకున్న ధాత్రి ఏకాదశీ వ్రత మిట్లు
నుడిగింప వంత మీ పడతి కేల

తే॥ గీ॥ యర్థమౌ పాత్ర దొరికిన ననఘ వరులు
చిత్త చాంచల్యమును వీడి శీఘ్రముగను
సుత కళత్రాత్మ దేహముల్ సొద్యముగను
త్యాగ మొనరించు టెఱుఁగరే ధరణిపాల,

క॥ దేవా యీ తరుణంబున
భావంబున ధైర్యమూని భవ బంధములన్
భావింపక చూడ దగదే?
కైవల్యపదవి ఘటించు కార్యంబునకై.

ఆ॥ వె॥ కాన పుత్త్రి శిరము ఖండించి యైనను
తన్వి కోర్కె దీర్చి తక్షణంబె
హరిదిన వ్రతంబు నాచరించు మనుచు
పింతి విభుని ప్రోత్సహించుచుండె

తే॥ గీ॥ అపుడు ధర్మాంగదు డచటికి కరుగు దెంచి
సకల విషయముల నెఱిగి సొంతముగను
జనకు నెదుటకు నేగి యంజలి ఘటించి
వినయ ముట్టి పడుచు నుండ ననియె నిట్లు.

క॥ హరివాసర ముడుగనిచో
తరుణి యడిగె నంట నీదు తనయుని యసువుల్
తరియించె నాదు జన్మము
ధర యింతటి పుణ్యమున్నె తలపగ నెందున్,

క॥ "జాతస్యహి ధ్రువం మృతి" యను
పూతంబైనట్టి నీతి బ్బుధు లెఱుగనిదే?
శీతోపవాసములచే
నీ తనువు కృశింప కుందునే యెభ్భంగిన్?

క॥ వెనుదీయక నీ సతి వాం
ఛను కాదనకుండ దీర్చి చక్రివ్రతమున్
గొనసాగింపుము తండ్రి
మన మందునఁ జింత వీడి మాధవు దలరన్.

సీ॥ సామ్రాజ్య మంతయు సంయమీంద్రుని కిడి
సత్కీర్తి నందె త్రిశంకు పట్టి
యనుగు పుత్త్రుని జంపి యుగజేశు మెప్పించె
సద్వ్రతి సిరియాళ చక్రవర్తి
యశనంబు నంతయు నతిథికి నర్పించి
దివికి నరిగె రంతిదేవ నృపుడు
జంగమయ్యకు తన సతి నొప్పగించి కై
లాసంబు నొందె భళ్ళాణ విభుడు

తే॥గీ॥ తను వశాశ్వతమనియెడు తథ్య మరసి
మహిని పెద్దలు జూపిన మార్గ మెఱిగి
యర్హమౌ పాత్రి దొరకిన యదను నందు
ధర్మ మొనరింపఁ జంకేల యవనినాథ.

తే॥గీ॥ చిత్తశుద్ధితో ననిశంబు చేయుచున్న
పుణ్య హరిదిన వ్రతముకై పుత్త్రి నన్ను
వేగ ఖండించి శ్రీహరి ప్రీతి గనుము
సుతుల గనవచ్చు నూర్వురు సతులు లేరె?

చ॥ జనకునితోడ నిట్లనుచు స్నానమొనర్చి పవిత్రుఁడై హరిన్
దన మది నిల్పి జంతకయె ధ్యాన నిమగ్నత నున్న బాలునిన్
మనమున సంశయం బుడిగి మాధవు పూజను చేయు దీక్షతో
దనయుని వధింప సిద్ధపడు తండ్రిని ధీరత నున్న తల్లినిన్॥

క॥ తన పరివారము తోడను
వినువీధిని నిలిచి చూచు విభు విష్ణువుతో
వనజాక్షి యింది రనియెన్
జనవేల నృపాలపుత్త్రుఁ జయ్యన బ్రోవన్.

క॥ జనపతి కరవాలముతోఁ
దనయుని దునుమాడ నున్న తరుణము నందున్
జనని తెగునను విభుని తెం
పును సుతు సాహసమును గని మోహిని మదిలోన్.

క॥ భయ విస్మయములు పెనుగొన
రయమున ఖడ్గమును బట్టి రాజున కనియెన్
నియమ మని పలుకుచు ని
ష్ప్రయోజన మగు హరివాసర వ్రతమునకై

క॥ కరుణను వీడి నిజాత్మజు
శిరమును దునుమాడు తలపు క్షితి రాళ్ళకునై
పురి గోపురముల నన్నిటిఁ
ద్వరపడి కూల్చుటయె కాదె? ధరణీనాథా.

క॥ ఎపుడో సద్గతులను మో
క్ష పదవియు హరివ్రతమ్మున గలుగునొ లేదో
యిపుడీ పుత్త్రు నిటు వధిం
చి పాప మొందంగఁ దగునె క్షితిపాలమణీ.

క॥ అనపత్యునకు గతులు లే
వను శ్రుతి వాక్యంబుల నెఱిగియు నజ్ఞాని వలెన్
వినుత గుణ శీలుఁడవౌ తన
యున్విదునుమ వివేక మౌనే యుర్వీనాథా।

సీ॥ సచివుల వాక్యముల్ రుచియింప కుండును
జక్కగ యోచించు శక్తి చెడును
రాచకార్యము లందు శ్రద్ధ తొలంగును
శ్రీయుము ల్పలికినఁ జెవులఁ జొరవు
ఘనమైన పూర్వపు గౌరవ మెడలును
సత్కీర్తి క్రమముగ సన్నగిలును
ధనమును ధైర్యంబు తక్కువై పోవును
మానాభిమానము ల్మంట గలియు

తే॥గీ॥ మగువలను గూడి చరియించు మనుజులకును
సతుల నూర్వశి తోడను సతత మిలను
గామ లోలతను జెలఁగు కాముకుడవు
భావ ముండునె నీకు నా భ్రమయె గాని.

క॥ అని రుక్మాంగదు దూఱుచు
దనయుని ధర్మాంగదు గని తగునే నీకున్
జనకు దనిన మాత్రంబున
జనుదెంచి నను దునుము మని చలమూనంగన్,

సీ॥ తెంపరి మాటలు నింపగు తండ్రికి
నేటికి చావంగ నిపుడు నీకు
పాపిష్ఠ మిత్తు నటించుఁ బట్టును బట్టుట
విజ్ఞాన మెట్లగు వెఱ్ఱిగాని

యాగ్రహం బేగాని యవనీశు డెఱుఁగడు
పడుచు దనపు వల్కు విడిచి పెట్టు
సామ్రాజ్య పదవిని జక్కగ జేపట్టి
ప్రజలను పాలించు వయసు వాద

తే:గీ॥ విపుడు చచ్చి సాధించు నదేది కలదు
ధర "శరీర మాద్యం ఖలు ధర్మ సాధ
న" మను నీతి శాస్త్రపు వచనం బెఱుగవె
యని సుతు నదిమి పలికి ధరాధిపు గని.

చ॥ తిరముగ నీతు మీదటను దిక్కగు వానిని వంశవర్ధనున్
నిరుపమ సద్గుణాకరుని నీరజనేత్రు పవిత్ర పాదము
ల్నిరతము నిశ్చలత్వమున నెమ్మన మందున గొల్చుసౌమ్యునిన్
సరసతగావు మార్యనుత చక్రిదినవ్రత ముఃజ్ఞగించుచున్.

చ॥ అన విని రాజచంద్రు దనె యబ్జదళాక్షి హితోక్తు లేటికిన్
వనజభవుండు, శంకరుఁడు, వారిజ నాథుడు వచ్చి చెప్పినన్
విని హరివాసర వ్రతము వీడుట యెన్నడు గాదు గావునన్
వెనదుటమాని పోగదవె వేగ మటంచును ద్రోసిపుచ్చుచున్.

క॥ కరవాలముతో తనయుని
శిరమును గురిపెట్టి ప్రేయ శ్రీహరి మహిమన్
విరుల సరం బగుచు వెలసె
కరవాలం బపుడు బాలు కంఠము నందున్

సీ॥ వెఱగంది భూపతి వీక్షించుచుండగ
సంధ్యావళీదేవి సంతసించ
సద్భక్తి తోడను సంకీర్తనల సల్పు
గద్యమౌ స్వరముని గడముతోడ

నేత్రోత్సవంబుగ నృత్య మొనర్చుచు
ఘనత గన్న దివిజ గణముతోడ
భువన మందెల్లెడ మూర్తిభవించిన
సరసిజగర్భ శంకరుల తోడ

తే॥ గీ॥ పాల సంద్రపు ముద్దుల పట్టితోడ
నార్త దుఃఖోద్ధరణ బిరుదాంకితుండు
విష్ణుదేవుడు శీఘ్రమే వృథ్వియందు
సార్వభౌముని మ్రోల సాక్షాత్కరించె,

తే॥ గీ॥ అట్లు ప్రత్యక్ష మైన శ్రీహరిని గాంచి
సంభ్రమ మాశ్చర్య చిత్త సంజాత అగుచు
నంజలి ఘటించి వా రందఅధిక భక్తి
సన్నిధినిజేరి స్తుతియింప సాగిరిట్లు

ఉ॥ శ్రీరమణీసుపూజిత విశిష్ట పునీత పదాబ్జ। సజ్జనో
ద్ధారక? మేరుధీర। సురతాపస చిత్త సరోజ షట్పదా।
వారిజ లోచనా; గరుడ వాహన। నీరద నీలదేహ। సం
సార పయోధితారక। నిశాచర తామసభంగ శ్రీహరి।

ఉ॥ దాస జనావళి తోష। జిత దారుణ దుష్కృత దోష।
భూసుర వారపోష| పరిపూర్ణ సుధాసమభాష। కౌస్తుభో
ద్భాసిత వేష। దీనజన పంకజ పూష| మహేశ్వరాది దిక్
శాసక భృన్మనీష। బుధసన్నుతకీర్తి విశేష; మాధవా।

క॥ అని యధిక భక్తితోడను
వినుతించెడు జనులలోన వృథ్వీనాధున్
గని సంతసంబుఁ గరుణయు
బెనుగొన సుజనావను డగు|వెన్నుడు పలికెన్.

క॥ మెచ్చితి నీ వ్రతదీక్షను
ఖచ్చిత మగు సత్యవాక్య ఘనధైర్యములన్
నచ్చిన వరంబు నీయగ
వచ్చితి నిక గోరుమయ్య వసుధాధీశా!

వ॥ అని పలుకు నాదివిష్ణువు పాదకమలకంబులకు సాష్టాంగ వందనం బాచరించి లేవకయున్న రాజేంద్రుఁ కూర్మితో లేవనెత్తి శ్రీహరి యిట్లనియె,

రాజేంద్రా యీ మోహిని బ్రహ్మమానస పుత్రిక. పవిత్ర చరిత్ర వత్మభవుఁడు నీ భక్తి పరిక్షింప దలచి యిక్కాంతను సృష్టించి పంపి నందున తగురీతి వర్తించి నీ సత్కీర్తిని ముల్లోకము లందు ప్రకాశింప జేసినది. ఈమె నీ కానుకూలవతి గాని వేఱుగాదు నీ సతు లెల్లరు పరిశుద్ధ హృదయులు. నీ భార్యలకు నీకును నీ సుతు నకును మోక్ష మొసగుచుంటిని. నీ కుమారుఁడు ప్రజారంజకముగా రాజ్యమును పాలించి తదనంతరము వైకుంఠమున కేతెంచునని పల్కి ధర్మాంగదుని పట్టాభిషేకమునకు,

క॥ సరసిజనాభుడు శీఘ్రమె
గరుడిని పంపెను పునీత గంగాజలమున్
సురుచిర భూషణములు తగు
పరికరములను సమకూర్ప ప్రాభవమలరన్

సీ॥ విభుధ పుంగవులైన విప్రుల రావించి
సరసిజభవభవుల్ సంతసింప
సురముని గణముతో శోభిల్లుచున్నట్టి
మణిమయస్మమంటప మధ్యమందు

బంగరుగద్దెపై ప్రీతి భాయుతుండైన
ధర్మాంగదుని నిల్పి-తగువిధాన
భూరివైభవమున-భూచక్రమునకెల్ల
పట్టభద్రునిగను పరగజేసి

తే॥ గీ॥ నీతిమార్గమువీడక-నీదు ప్రజలఁ
గన్నబిడ్డలమాడ్కిని గరుణ గనుచుఁ
యిలను నా చంద్ర తారార్క మేలుమనుచు
ప్రీతితోడను దీవించి శ్రీధరుండు,

సీ॥ మహనీయుడైన రుక్మాంగదు నాతని
మగువలతోడ విమానమందు
సత్యాదరంబున-నధివసింపఁగజేసి
దేవగణంబులు, దిగధిపతులు,
సనకసనందాది-సన్మునీంద్రుల దివ్య
సంకీర్తనంబులు సాగుచుండ
నిందిరాదేవితో నిందీవరాక్షుండు
స్వర్ణరథంబుపై సత్వరముగ

తే॥గీ॥ భూవిభునితోడను గదలి-వ్యోమవీధి
త్రిదశ లోకములన్నింటి-వదలివైచి
సత్యకైలాససీమలు-సరగదాటి
యరిగె తిన్నగా-వైకుంఠపురమునకును

క॥ హరివాసరవ్రతంబా
చరించిన ఫలముగ రాజచంద్రుడు సతులన్
నరగున వైకుంఠమునకు
నరిగిరి లక్ష్మీసుగూడి యానందముతో

ఉ॥ బంగరు కొండపై దివిజ భామిను లెల్ల భజింపుచుండ రు
క్మాంగద భూవిభుండు నిజకాంతలగూడి ముదంబుతోడ ది
వ్యాంగ సుఖాసియై యలరు నచ్యుతుగొల్చుచు నుండె, శ్రీహ
రాంగణ హర్మ్యమందు సుస్థిరంబుగ మాధవు పాద సన్నిధిన్

క॥ అక్కథకుండట్లు ఘనులకు
జక్కగ రుక్మాంగద కథ సంపూర్ణముగా
మక్కువతో వినిపించెను
నెక్కుడు నానక్తితోడ నెల్లరు మెచ్చన్

తే॥గీ॥ జగతి నీ పుణ్యచరితను జదువువారు
వినయమెుప్పంగ కూర్మితో వినెడివారు
భక్తితోడను నీకథ వ్రాయువారు
శ్రీహరి కృపకు పాత్రులై చెలగుచుండ్రు.

క॥ సరసీరుహదళ నేత్రా!
సరసీరుహమిత్ర తేజ! సరసిజ నాథా
సరసీరుహభవ జనకా!
సరసీరుహవైరి వదన శౌరి ముకుందా!

ఇది శ్రీ విశ్వేశ్వర వరప్రసాదలబ్ధ కవితా సంపన్న వేంకటేశాంబ
వేంకటేశ్వర పుత్త్ర ఆపస్తంబసూత్ర శ్రీవత్సస గోత్ర
యర్రమిల్లి శివ శంకరమూర్తి ప్రణీతంబైన
ఏకాదశీ మాహాత్మ్యమునందు సర్వము
తృతీయాశ్వాసము

— () —